

మనం ఉద్యోగాలు చెయ్యడానికి కాదు పుట్టింది !

మనకోసం మనంగా బతకడానికే పుట్టాం !!

ఉద్యోగాల పేరుతో మనల్ని, మన మనసుల్ని, ఆత్మల్ని

ఇంటా, బయటా అణువణువునా చచ్చేదాకా నిరంకుశంగా శాసించే

దుష్టసంస్కృతికి స్వస్తి పలుకుదాం !!!

# నిరుద్యోగం పురుషలక్షణం

(**కలగూరగంప** బ్లాగు టపాల సంకలనం)

*మనిషి ఎప్పటికైనా స్వతంత్రంగా బతకాలి, బతుకుదాం...!*


తాడేపల్లి లలితాబాలసుబ్రహ్మణ్యం

హైదరాబాదు

http://www.tadepally.com



ఫిబ్రవరి - ఏప్రిల్ ౨౦౦౮

**NIRUDYOGAM PURUSHA LAKSHANAM** (Telugu)

*An Anthology of Serial Posts from KALAGOORAGAMPA blog*

By Tadepalli Lalitha Bala Subrahmanyam

February – April 2009

Hyderabad



PUBLISHED FROM THE INDIAN UNION

# నివేదనము

పాఠక మహాశయులకు నమోన్నమహ

మొదట ఇది పుస్తకంగా ఉద్దేశించి రాసినది కాదు. నా **కలగూరగంప** బ్లాగులో ౨౦౦౯ ఫిబ్రవరి-ఏప్రిల్ నెలల్లో దీనిలోని అంశాలు వేఱువేఱు టపాలుగా ప్రకటించబడ్డాయి. ఆ తరువాత పాఠకుల కోరిక మేఱకు వాటన్నింటినీ కలిపి ఒకే వహనీయ పత్ర సంప్రకార (PDF) పుస్తకంగా కూర్చి అంతర్జాలంలో పెట్టడం జఱిగింది. చాలాకాలం పాటు నాలో జఱుగుతూ వచ్చిన అంతర్మథనమే ఈ వ్యాసాలుగా రూపుదిద్దుకున్నది. మనమందఱమూ మన స్వంత గుర్తింపుని కోల్పోయి మనం పనిచేసే కంపెనీల పేర్లు గోత్రనామాల్లాగా తగిలించుకొని తిరగడమూ, సమాజంలో వాటికే తప్ప వ్యక్తులుగా మనకి ఏ విలువా లేకపోవడమూ నన్ను బాధించింది. మానవజీవితంలో మానవసంబంధాలనే ప్రాణవాయువు తగ్గిపోయి వ్యాపారధోరణి అనే బొగ్గుపులుసువాయువు ఎక్కువైపోవడం నాకు ఊపిరాడనివ్వలేదు. దీనికి కారణాల్ని శోధించే ప్రయత్నమే ఈ వ్యాససంపుటి.

నెనర్లు.

విరోధి చైత్రము — భవదీయుడు

కలి-౫౧౧౦ — తాడేపల్లి

# నిరుద్యోగం పురుషలక్షణం

## విషయసూచిక



# నిరుద్యోగం పురుషలక్షణం

## మొదటి అధ్యాయం - ఉపోద్ఘాతం

### ఉద్యోగాలు దేనికి ?

పంచవ్యాప్తంగా కోట్లాది ఉద్యోగాలు పోతున్నాయి. Retrenchment, Job cull, Lay-off, Downsizing ఇలా ఎన్ని అష్టోత్తర శతనామాలు పెట్టుకున్నా దాని



Asiasoft India Ltd.

# 609, Nent Annex, Bil Gates Avenue, Gachibowli, HYDERABAD (India)

To

Mr.Krishna Valluri
Senior Manager (Projects)
Employee No. C-0112
Hyderabad Campus.

Dear Associate,

As you are perhaps aware, the Organisation is currently on a restructuring drive and in the process, compelling us to take certain expedient measures which include temporary decommissioning of a modem part of our workforce in order to rationalise the "work2manpower" ratio.

At this juncture, let me take this opportunity to thank the unswerving commit- ment and loyalty with which you served the Organisation all these years. I think it is high time I took you into confidence on these matters and let you decide on the choi- est course of action open to you in your own best interest for the near future.

అంతిమ పిండితార్థం - బరువెక్కిన గుండెతో, బరువు తగ్గిన జేబుతో ఇంటికెళ్ళడమే. ఈ పరిణామం ఇండియాలో ఇంకా అంతబాగా పుంజుకోలేదు. ఎన్నికలయ్యేదాకా ఎలానో ౨ ఆపుతున్నారని, ఆ తరువాత మన పరిస్థితి ఇప్పటిలా కూడా ఉండకపోవచ్చుననీ పుకార్లు షికార్లు చేస్తున్నాయి. ఎంత విషమించినా ఇందులో ఊరట నిచ్చే అంశం ఒక టుంది. అదేంటంటే భారతీయ ఆర్థిక వ్యవస్థ చైనాఅంత స్థాయిలో విదేశీ వాణిజ్యాన్ని ప్రాపు (support) గా చేసుకొన్నది కాకపోవడం. పాశ్చాత్య దేశాల మాదిరి ఇది పూర్తిగా చదువుకున్న వర్గాన్నే ఆశ్రయించుకుని నడిచేది కూడా కాకపోవడం. ఇక్కడి ఉత్పత్తుల కీ, సేవలకీ ఎక్కువశాతం ఇక్కడివారే గిరాకీదార్లు (clients). స్థానిక అవసరాలే ఈ వ్యవస్థకి ప్రధాన చోదకశక్తి. అదీ గాక ఇక్కడ నూటికి అరవై అయిదు శాతం మంది వ్యవ సాయ ఆధారిత వృత్తులవారు (గ్రామీణులు). ఈ వృత్తులకి సంబంధించిన ఉపచయాలూ, ప్రతిచయాలూ (inputs and outputs) దేశీయంగా లభ్యమయ్యేవే. బయటినుంచి వచ్చేవి కావు. ఇది ఇప్పటికీ "వానా వానా వల్లప్పా..." మీదనే నిలదొక్కుకుంటున్న దేశం. ప్రపంచ వాణిజ్యంలో భారతదేశ వాటా కేవలం ౧.౩ శాతం. ఇది మన స్థూల దేశీయోత్పత్తి (GDP) లో ౨౩ శాతం మాత్రమే. ఇందుకు మనం చాలాకాలంగా కించపడుతూ ఉన్నాం. కానీ "మన బలహీనత" అనుకున్నదే ఈ రోజు మన బలంగా పరిణమించడమూ, తద్ద్వారా మనం పూర్తిగా దివాలా ఎత్తే పరిస్థితి లేకపోవడమూ దైవలీల.

విదేశీయుల మీదా, వారి భాషల మీదా ఆధారపడి బతికే రంగాలూ, వాటిల్లో పని చేసేవారు దెబ్బతినొచ్చు. కాదనలేం. కానీ వాళ్ళు మాత్రం ఎందుకు దెబ్బతిన్నట్లు మొహం పెట్టాలి ? అంటాను. వ్యాపారవ్యూహాన్ని స్వల్పంగా మార్చుకుంటే సరిపోతుంది. హైదరాబాదులో (దిగుమతి చేసుకున్న) ఇంగ్లీషు పుస్తకాలమ్మే కొట్లవాళ్ళు ఈ తిరోగమనం (recession) దెబ్బకి బెంబేలెత్తి ౨౩ నుంచి ౩ం శాతం దాకా తగ్గించి అమ్ముతున్నారు. తెలుగు పుస్తకాల విక్రేతలు మాత్రం ఏ పుస్తకాన్నీ ఒక్క పైసా అయినా తగ్గించకుండా అమ్ముతున్నారు. అదే అందులో ఉన్న చిదంబర రహస్యం. స్థానిక గిరాకీ (local demand) మనల్ని కోటీశ్వరులుగా చెయ్యలేకపోవచ్చు. కానీ అది స్థిరమైనది, చెక్కు చెదరదు. అందుచేత అది మనల్ని జీవితాంతం సంతృప్తికరంగా పోషించగలదు. సప్తసముద్రాల అవతల కూర్చున్నవాళ్ళ కోసం నడిపే వ్యాపారాలకి ఆ భరోసా ఇవ్వలేం.

**మనిషికి ఉద్యోగం అంత ముఖ్యమా ?** ముఖ్యమైతే, ఎందుకది అంత ముఖ్యమైపోయింది. ? అని ప్రశ్నించుకుంటే చాలా బాధాకరమైన వాస్తవాలు మన ముందు కొటివిదెయ్యాల్లా నిలబడతాయి. ఒకప్పటి "ఉన్నవాళ్ళు, లేనివాళ్ళు (haves and have-nots)" అనే సామాజిక విభజన ఈరోజు "జీతాలిచ్చేవాళ్ళు, జీతాలు తీసుకునేవాళ్ళు" అనే విధంగా హుందాగా రూపురేఖలూ, బిరుదాలూ మార్చుకున్నట్లు కనిపిస్తోంది. అయితే ఒక తేడా ఉంది. లేనివాడు పాతకాలంలో లేనివాడుగానే ఉండేవాడు. అంతే తప్ప "లేనివాణ్ణి" అని మెడలో మూర్ఛబిళ్ళ కట్టుకొని తిరిగేవాడు కాడు. ఇప్పుడు మనం వివిధ కార్యాలయాలకి వెళితే అక్కడ ఉద్యోగులు తమ మెడల్లో కంపెనీ కట్టిన మంగళసూత్రాలతో దర్శనమిస్తారు. "నేనొక దిక్కుమాలినవాణ్ణి, ఎక్కణ్ణుంచో పొట్ట పట్టుకొని వచ్చి ఈ కంపెనీలో చేరాను, ప్రస్తుతానికి దీని బాస్ నాకు దేవుడు. ఇది లేకపోతే నేను చస్తాను మొర్రో !" అని సదరు గుర్తింపు అట్ట (ID Card) మౌనవ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మతత్త్వంలా మనకి చెబుతుంది. అందరమూ ఆ బిరుదాల చట్రంలో ఇమడాలని పిల్లిమొగ్గలేస్తున్నాం, మన పిల్లల్ని కూడా ఆ పిల్లిమొగ్గలకి సిద్ధం చెయ్యడం కోసం బళ్ళకి పంపిస్తున్నాం. ఏం ? మనకి ఉద్యోగం పోతే అది మన జీవితంలో అంత దిగ్భ్రాంతి కలిగించే, మన పునాదుల్ని సమూలంగా పెకిలించే ప్రళయకాల ఝంఝూప్రభంజనం ఎందుకవుతున్నది ? కంపెనీ మూస్తున్నవాడికి మాత్రం అలా ఎందుకు లేదు ? వాడు వ్యాపార ప్రతిష్ఠ గురించి బాధ పడే స్థాయిలో ఉన్నాడే తప్ప మనలాగా కుటుంబం గురించి, రేపొద్దున పళ్ళు తోము కోవాల్సిన ట్యూబులో మిగిలి ఉండగల పేస్ట్ గురించి జుట్టు పీక్కునే స్థాయిలో లేడేం ?

పని చేస్తేనే మనిషి బతకాలా ? పనిచెయ్యనివాడూ, పని చెయ్యలేనివాడూ, పని చెయ్యడం ఇష్టం లేనివాడూ వీళ్ళంతా చచ్చిపోవాలా ? పని చెయ్యనివాళ్ళని పోషించడానికి కుటుంబాలు గానీ, సమాజం గానీ, ప్రభుత్వాలు గానీ ఎందుకు తిరస్కరించాలి ? ఏ ప్రాతిపదికన ? ఏ నియమం ప్రకారం ? ఏమిటా అలిఖిత ఒప్పందం ? ఎవడూ తన పుట్టుకకి తాను కారకుడు కాడు. "నేను సమాజం కోసం పనిచేసిపెడతాను, నన్ను పుట్టనివ్వండి

మహాప్రభో !" అని ప్రమాణస్వీకారం చేస్తూ ఎవడూ జన్మించలేదు. "పుట్టబోయేవాడు పనిచేస్తాడని హామీ ఇస్తేనే నువ్వు కనా"లని ఏ సమాజమూ తల్లులతో ఒప్పందం చేసుకోలేదు. చేసుకున్నా, తన పరోక్షంలో, తనకి తెలియకుండా, తనని ఇజీకిస్తూ చేసుకొన్న ఒప్పందాలకి మనిషి విలువివ్వనక్కఅలేదు. ఒకవేళ అలాంటి ఒప్పందాలుంటే అది సమాజం అనిపించుకోదు, నాజీల సామూహిక హింసాశిబిరం (concentration camp) అవుతుందంతే ! పని చేస్తేనే మనిషికి సమాజంలో బతికే హక్కు ఉందన్న ఈ తప్పుడు, దైవవ్యతిరేక, ప్రకృతివిరుద్ధ, అమానవీయ సూత్రం ఎంతగా వ్యాపించిందంటే, తన పుట్టుకకి తాను కారకుడు కానటువంటి మనిషి తన చావుకి మాత్రం తాను కారకుడు కావడానికి పూనుకుంటున్నాడు, ఆ పని దొఱకని రోజు, చెయ్యలేనిరోజు ! ఆ లెక్కన చూస్తే తమ బిడ్డలు ఏ పనీ చెయ్యకపోయినా వారికి కోట్లాది రూపాయల ఆస్తుల్ని ఎలా ధారాదత్తం చేస్తున్నారు ? బయటివాళ్ళకి మాత్రం "పని చెయ్యాలి, పాడె మొయ్యాలి" అని నీతులు వల్లిస్తున్నారెందుచేత ? ఎవడైనా దొంగతనం చేస్తూ పట్టుబడితే, "రాస్కెల్ ! ఎద్దులా గున్నావ్. కష్టపడి పనిచేసుకు బతకలేవూ ?" అని అందఱూ హీరోల్లాగా తలో చెయ్యి వేస్తారు. మఱి వీళ్ళంతా "కష్టపడి" పనిచేస్తున్నారా ? దొంగ సంగతెలా ఉన్నా, కష్టపడ్డం అసలు ఎవడికి ఇష్టమబ్బా ? కష్టపడకుండా బతకాలని కాదూ, కొంతమంది GRE, GMAT, TOEFL ప్రభృతిగా గల అందమైన ముసుగుల వెనక దాక్కున్నది ? కష్టపడకుండా బతకాలని కాదూ, కొంతమంది సినిమాల్లో చేఱుతున్నది ? కష్టపడకుండా బతకాలని కాదూ మఱికొందఱు రిజర్వేషన్ల కోసమూ, వాటిల్లో మళ్ళీ ఉపవర్గీకరణల కోసమూ వెంపర్లాడుతున్నది ? ఇంతమంది సోమరిపోతుల్ని చుట్టూ పెట్టుకొని మన మందఱం పవిత్రులమైనట్లు, దొంగ ఒక్కడే సోమరిపోతైనట్లు వాణ్ణి కొడతారేంటి ?

అసలు మనిషి పనెందుకు చెయ్యాలి ? పశుపక్ష్యాదులు పని చెయ్యవు. అవి తిండి వెతుక్కుంటాయంతే. సరే పోనీ, మనిషి ఊరికే కూర్చోలేక చేస్తే చేస్తాడు, కానీ అది ఇతరుల కోసం ఎందుకు చెయ్యాలి ? ఆ చెయ్యడాన్ని ఐచ్ఛికం కాక ఖచ్చితం చేసిపారేశారెందుచేత ? మనకోసం మనమేమైనా చేసుకుందామన్నా సాధ్యం కాని పరిస్థితి ఈ ఆధునిక కాలంలో ఎందుకు దాపరించింది ? తనకోసం తానేమీ చేసుకోలేని దుర్గతికి, ఇతరులకి చేసిపెడితేనే అది పనిగా గుర్తింపు పొందే స్థితికి, అలా గుర్తింపు పొందితేనే అన్నం తినడానికి నోచుకునే అవస్థకి మనిషెందుకు తేబడ్డాడు ? స్వచ్ఛందంగా, మనకోసం మనం పని చేసుకుందామన్నా మన చుట్టూ అందుకవసరమైన ప్రాకృతిక వనర్లు ఎందుకు లేకుండా పోయాయి ? పని పేరుతో మనుషులు యథార్థంగా చేస్తున్నది ఏంటి ?

**మనం చేస్తున్నవి నిజంగా ఉద్యోగాలేనా ?** ఒక చలనచిత్రంలో ప్రతినాయకుడి దగ్గఱ బ్రహ్మానందం వంటవాడుగా పనిచేస్తూంటాడు. ఆ ప్రతినాయకుడు అంచనాలకు అందనంత తిక్కల మనిషి. ఎప్పుడూ ఏదో ఒక అసాధ్యమైన, అర్థంలేని పనిని బ్రహ్మానందానికి అప్పగిస్తూంటాడు. ఆ క్రమంలో ఒకసారి "ఈ Hindu పేపర్ ని ముక్కలుముక్కలుగా చించెయ్" అని ఆజ్ఞాపిస్తాడు. ఎందుకు చించమంటున్నాడో అర్థం కాని బ్రహ్మానందం అలాగే పరపరా చించేస్తాడు. చించాక "నేను ఆఫీసుకెళ్ళి వచ్చేలోగా ఈ ముక్కలన్నీ కలిపి మళ్ళీ పేపరుగా అతికించు, చదువుకుంటాను" అని తాపీగా చెప్పి వెళ్ళిపోతాడు ప్రతినాయకుడు. దిగ్భ్రాంతి చెందిన బ్రహ్మానందం "నువ్వు నాకర్థం కావురోయ్"అనుకుంటూ ఆ పనిలో నిమగ్నమవుతాడు.

వాస్తవప్రపంచంలో చూసుకుంటే అసలైన బ్రహ్మానందాలం మనమే, మనల్ని ఉద్యోగులుగా నియమించి, మన చేత అర్థం పర్థం లేని తిక్కపనులూ, అమానుష ప్పనులూ చేయిస్తూ అందుకోసం మనకి జీతాలిచ్చే ప్రతినాయకులే ఈ రాజకీయ నేత లూ, ధనికులూ, పారిశ్రామికవేత్తలూ ! వీళ్ళు శుభ్రంగా ఉన్నవాటిని బగ్గంపాడు చేసి కొత్త వేవో నిర్మిస్తామంటారు. ఒకడు ఒక దేశం మీద బాంబులేయించి, దాన్ని సర్వనాశనం చేసి, ఆ తరువాత దాన్ని పునర్ నిర్మిస్తున్నానంటూ కొత్త కాంట్రాక్టులూ, అందులో ఉద్యోగాలూ కల్పిస్తాడు. మనమంతా చంకలు కొట్టుకుంటూ పోయి వాటిల్లో చేఱతాం. మఱొకడు ఒక కిరాణాకొట్ల సమాహారం నెలకొల్పి చిల్లఱకొట్లవాళ్ళ ఉపాధిని నాశనం చేస్తాడు. తరువాత వాళ్ళందఱికీ తన సమాహారంలో ఉద్యోగాలిస్తాడు. వేఱొకడు శాస్త్ర వేత్తలతో చెప్పి నయం కావడానికి వీల్లేని భయంకరమైన జబ్బుని కలిగించగల వైరస్ ని సృష్టిస్తాడు. ఆ తరువాత దాన్ని ఎదుర్కోవడానికి పరిశోధనల నిమిత్తం నిధులు కేటా యిస్తాడు. ఇంకొకడు అయిదులక్షల మందిని ఉన్నపళాన లేవగొట్టి లక్ష ఎకరాలకి నీటి పాఱుదల

సౌకర్యం కల్పిస్తాడు. ఆ ప్రాజెక్టులో వందలాదిమంది చదువుకున్నవాళ్ళకి ఉద్యోగాలు. మరొకడు వేలాది వెధవపనులు చేసి వాటి మీద జనం మాట్లాడకుండా వాళ్ళ నోరు ముయ్యడం కోసం ఒక టీవీ ఛానల్ తెరుస్తాడు. అందులో మనకి ఉద్యో గాలు. మన ప్రతిభని నిరూపించుకునే అవకాశం. ఇంకొకడు తన పార్టీవాళ్ళు ఒక నది ఒడ్డున పరిశ్రమలు పెట్టి దాన్ని కలుషితం చెయ్యడానికి దశాబ్దాల తరబడి అనుమతి స్తాడు. ఆ తరువాత ఆ నదిని శుద్ధి చేస్తున్నామంటూ దాని పొడవునా వందలాది ట్రీట్ మెంట్ ప్లాంట్లు పెట్టించి అందులో ఉద్యోగావకాశాలు కల్పిస్తాడు. కాలుష్యమూ మనకి సంతోషమే, మనకి ఉద్యోగాలొస్తున్నాయి గనుక ! ట్రీట్ మెంట్ ప్లాంట్లూ మనకి సంతోషమే, మనకి ఉద్యోగాలొస్తున్నాయి గనుక !

మనం అంతకు మించి ఆలోచిస్తే వాళ్ళ పునాదులు కూకటి వేళ్ళతో కదిలిపోతాయి. అందుకని మన ఆలోచనా బీజం అంతకుమించి ఎదక్కుండా వాళ్ళు ఎప్పటికప్పుడు జాగ్రత్త పడుతూంటారు, Industry-University tie-ups, రిజర్వేషన్లు, వర్గీకరణలూ అంటూ ! మనం కూడా వాళ్ళిచ్చే ఉద్యోగాల కోసం కఱువు మొహాలేసుకొని వాళ్ళ ముందు దీనంగా నిలబడి, మనలో మనం బాహాబాహి, కేశాకేశి కొట్లాడుకుంటూ యథాశక్తి వాళ్ళకి టిక్కెట్ లేని వినోదాన్ని పంచుతాం. తమ డబ్బునీ, అధికారాన్నీ ఉపయోగించుకొని వాళ్ళు ఎంతటి విధ్వంసక చర్యలకి ఒడిగట్టినా మనం వాళ్ళ మీద పోరాడలేకపోవడానికి అసలు కారణం - వాళ్ళివ్వజూపే ఉద్యోగాల మీదా, వాటిని అడ్డం పెట్టుకొని మనం తీసుకోదల్చుకున్న జీవితకాలపు అప్పుల మీదా మనం లోలోపల పెంచుకున్న వల్లమాలిన ఆశ. వాళ్ళు కూలిపోతే మనం కూడా కూలిపోతామనే గుడ్డి మూఢవిశ్వాసం. వాళ్ళ దిగ్గజాలు (సంస్థలు) కూలిపోతే ఆ యేనుగుల పేడ మనకి ఎరువుగా ఉపయోగపడదేమోననే అంతర్గత బెంగ. మానవత్వం లోపించిన ఆ దిగ్గజాలే మన నాగరికతకి వైభవోపేత చిహ్నాలనుకునే అమాయకత్వం. వాళ్ళు ఉద్యోగాలివ్వక పోతే మనం చదువుకున్న చదువు వృథా అవుతుందనే వెఱ్ఱిమాలోకత్వం. అందుకే ఇదొక విషవలయం అని గ్రహించలేకపోతున్నాం. గంజాయి, సారాయి మప్పినట్టుగా మనకి ఈ ఉద్యోగాల్నీ, వీటి మీద నానారకాల అప్పుల్నీ, ఆ అప్పుల మీద పప్పుల్నీ అల వాటు చేశారు. మనల్ని ఒక Fools' paradise లోకి తీసుకెళ్ళారు. వాళ్ళ జబ్బులు మనకంటించారు. వాళ్ళు మనకి మప్పినది మనం మన పిల్లలకి మప్పుతున్నాం, "బాగా చదువుకో, చదువుకుంటే మంచి ఉద్యోగం దొఱికి సుఖపడతావు" అంటూ ! ఇదేదో వినాయకుడి బొడ్లో అందఱూ వరసగా వేలుపెట్టిన కథలా తయారైంది. ఈ మధ్య బీహార్ ప్రభుత్వం ప్రకటించిన ఉపాధ్యాయ ఖాళీల్లో ఒక్కొక్క ఉద్యోగానికి పదిహేనొందల మంది చొప్పున దరఖాస్తు చేశారంటే ఆధిపత్య వర్గాలకి అంతకంటే కావాల్సింది ఏముంటుంది ?

పోనీ, ఏదో ఒక వస్తువుని ఉపయోగకరంగా ఉత్పత్తి చేసే రంగాల్లో ఉద్యోగాల పేరుతో పిలవబడుతున్నవి ఏ మాత్రం అర్థవంతమైన పనులు ? అని ప్రశ్నించుకుంటే - అవి కూడా పేపర్ చించి అతికే తరహా పనుల్లాగానే కనిపిస్తాయి.




మన ఉద్యోగాలు సమర్థనీయం (justifiable) అయితే పై బొమ్మలో కనిపిస్తున్నవాళ్ళ ఉద్యోగాలు కూడా సమర్థనీయమే. ఎందుకంటే ఆ ఉత్పత్తివిధానమే మనకూ వాళ్ళకీ సమానంగా జీవగఱ్ఱ, వెన్నెముక. ఏంటబ్బా వాళ్లు చేసే ఆ మహా "పని" ? వాళ్ళూ ఒక్క గింజ పండించరు, మనమూ పండించం. మనం వట్టి వినియోగదారులం, ఋణగ్రస్తులం. అంతే ! రైతులు చేస్తున్న అదనపు ఉత్పత్తి (surplus produce) చుట్టూ పిల్లితల గొఱిగ డం లాంటి కృత్రిమ శ్రమల్ని సృష్టించి వాటికి "పని" అని ఒక గౌరవనీయమైన పేరుపెట్టు కుని బతుకుతున్నాం. ఇప్పటికిప్పుడు ఈ పిల్లితలలు మనం గొఱిగడం మానేసినా ఎవరూ నష్టపోరు, మనతో సహా ! నష్టపోతామనేదొక మనోభ్రాంతి మాత్రమే. మానేస్తే బహుశా ఇంతకంటే మంచిపనులూ, ఉపయోగపడే పనులూ చేస్తాం.

# నిరుద్యోగం పురుషలక్షణం

## రెండో అధ్యాయం

### మన అసలు సమస్య వనర్ల కోల్పోక

సరే, మనుషులు పశుపక్ష్యాదుల్లాగా ఆహారాన్ని సేకరించి బతకలేరు గనుక ఏ పనీ చెయ్యకపోయినా కనీసం ఆహారాన్ని, ఇతర ఆవశ్యకాల్నీ ఉత్పత్తి చేసుకోకతప్పదనుకుంటే, అది ఎవడికి వాడు చేసుకోగలగాలి. అలా చేసు కునే వ్యవస్థ ఉండాలి. చేసుకునే వనర్లుండాలి. చేసుకోవడానికి సామాజికమైన మద్దతు, ప్రోత్సాహం ఉండాలి. మఱేది ? "ఇంకొకడి కింద పని చెయ్యి. ఇంకొకడికి అమ్ముకో" మనే జీవనవేదాంతాన్ని బోధించేవారే అందఱూ ! ఉద్యోగం లేనివారిని, చెయ్యనివారిని నేరస్థులుగా, హీనంగా చూసే భావాత్మక వాతావరణంలోంచి మనం బయటపడాలి. అసలు ఉత్పాదనారంగంలో, ఆ పనిలో ప్రత్యక్షంగా ఉన్నవాళ్ళెంతమంది ? ఎక్కువమంది అదనపు ఉత్పత్తిని అనుభవించడానికి పుట్టినవాళ్ళే కనిపిస్తున్నారు.

అసలు ఇంతమంది "ఉద్యోగాలో రామచంద్రా !" అని భూ-నభో౽న్తరాళాలు దద్దరిల్లేలా ఘోషించే పరిస్థితి ఎందుకొచ్చింది ? ఇంతమంది తాడూ, బొంగరం లేనివాళ్ళు ఎలా తయారయ్యారు మన సమాజంలో ? వీళ్ళకి ఉద్యోగాలిస్తున్నవాళ్ళు మొత్తం జనాభాలో ఎంతశాతం ? వాళ్ళ దగ్గఱ అన్ని వనరులు ఏ మార్గంలో పోగుపడ్డాయబ్బా ? వీళ్ళు సదా ఉద్యోగాలు చేసేవాళ్ళుగానూ, వాళ్ళు సదా ఉద్యోగాలు ఇచ్చేవాళ్ళుగానూ మిగిలిపోవడానికి కారణమేంటి ? ఉద్యోగాలిస్తున్నవాళ్ళు అసలు ఎక్కణ్ణుంచి ఊడిపడ్డారు ? ఉద్యోగాలు చేస్తున్నవాళ్ళంతా మధ్యతరగతి కిందికొస్తారా ? మనం ఈ ప్రశ్నలు



వేసుకోనంతకాలం ఉద్యోగాలు చేస్తూనే ఉంటాం.

**ఇప్పుడు మన దేశంలో అసలు మధ్యతరగతి (Middle class) అనేది ఉందా ?**

ఈ ప్రశ్న వేస్తే చాలామంది ఆశ్చర్యపోతారు. కానీ ఈ సందేహం చాలాకాలం నుంచి నన్ను పీడిస్తున్నది. ఒకవేళ ఉన్నా అది జీవన నాణ్యత (quality of life) పరంగా గానీ, బౌద్ధిక స్థాయిలో గానీ, చైతన్యంలో గానీ, క్రమశిక్షణలో గానీ అభివర్ధిత దేశాల మధ్య తరగతితో ఎంతమాత్రమూ పోల్చదగినది కాదు. లేదా ఇక్కడి మధ్యతరగతి బొత్తిగా లెక్కలోకి రానంత సూక్ష్మాతిసూక్ష్మమైన అల్పసంఖ్యాక వర్గం (microscopic mino-rity). మనం మధ్యతరగతి అని పేర్కొంటున్న దాంట్లో ఒక బృహద్ భాగం వాస్తవానికి ఒకరకమైన పేద తరగతి మాత్రమే. వీరు దారిద్ర్యరేఖ (poverty line) కి కొద్దిగా ఎగువన ఉన్నవారు మాత్రమే. వీరు ఒక అవసరాన్ని తీర్చుకుంటే ఇంకో అవసరాన్ని నిరవధికంగా వాయిదా వేసుకోవాల్సిన అగత్యంలో ఉన్నవారు. కనీసం రెండుమూణ్ణెల్ల ఆర్థిక ప్రణాళికైనా తమ చేతిలో, తమ అదుపాజ్ఞల్లో లేనివారు. నెలవారీ బడ్జెట్ కి మించి ఒక్క ఖర్చు అదనంగా వచ్చిపడ్డా దిక్కుతోచని నిస్సహాయులు. కనీసం పాతికా - ముప్ఫైవేల నగదైనా బ్యాంకులో ఉంచడం సాధ్యపడని దురదృష్టవంతులు. చాలా సందర్భాల్లో ఒక పాత డొక్కు సొంతిల్లు తప్ప వీరికి వేఱే వాణిజ్యపరమైన ఆస్తిపాస్తు లేమీ ఉండవు. "మధ్యతరగతి" అనిపించుకోవడానికి వీరికున్న ఏకైక అర్హత ఒకటి-రెండు విశ్వవిద్యాలయ పట్టాలు. ఇతరత్రా కూడా వీరి సామాజిక, రాజకీయ బలం ఒక రైల్వేకూలీని, ఒక రిక్షావాలాని, ఒక పనిమనిషిని తలదన్నేది కాదు . ఒకరకంగా చూస్తే వీరి కంటే ఆ శ్రామికుల బలగమే గొప్పది. అయినా వీరిని మధ్యతరగతిగానే పేర్కోవడానిక్కారణం - ఆ పేరుతో వీరి నుంచి పన్నులు దండుకుందామనీ, ప్రభుత్వ పథకాల నుంచి వీరిని మినహాయిద్దామనీ, తద్వారా డబ్బు మిగల్చుకుందామనే రాజకీయ కుట్ర *(మన్నించాలి, ఈ మాట వాడక తప్పడంలేదు)* తప్ప మఱింకేమీ లేదు. చిత్రమేంటంటే - రాజకీయజీవులకి ఆనందాన్ని కలిగిస్తూ ఈ కుట్రకి చదువుకున్న "మధ్యతరగతి" నామధారులు కూడా స్వచ్ఛందంగా సహకరిస్తున్నారు - కటిక పేదవాళ్ళ పక్కన తమని ఊహించుకోవడం ఇష్టం లేక. అదే ఈ సమాజంలో మొదట్నుంచి ఉన్న హిపో

క్రీసీ : ఉన్నవాడు లేనివాడిలా, లేనివాడు ఉన్నవాడిలా కనిపించాలని తాపత్రయపడ్డం.

పై గద్య (paragrapgh) లో నేను మధ్యతరగతిని కించపఱుస్తున్నాననుకునేరు. నా ఉద్దేశం అది కాదు. ఒకప్పుడు ఈ దేశంలో ఒక శక్తిమంతమైన మధ్యతరగతివర్గం నిజంగానే ఉండేది. అన్ని దేశాల మధ్యతరగతి లాగానే అది కూడా ఈ దేశపు కళల్నీ, సాహిత్యాన్నీ, సంస్కృతినీ అభివృద్ధి చేయడంలో ప్రముఖపాత్ర పోషించింది. అది ఉద్యమాల్లో పాల్గొన్నది. హక్కుల కోసం పోరాడింది. సంఘసంస్కరణలు తీసుకొచ్చింది. ఆ కాలంలో దాని సామాజిక స్పృహ, దేశభక్తి సాటిలేనివి. అది ఇతరుల ద్వారా ప్రభావితం కావడం మాత్రమే కాదు, ఇతరుల్ని ప్రభావితం చేసింది కూడా. దాని పేరు చెబితే ఆధిపత్య వర్గాలకి సింహస్వప్నంగా ఉండేది. ఆ దృష్టితో ఈ మధ్యతరగతిని పరికిద్దాం. అప్పుడు "వీళ్ళెవరు ?" అనేది మనకి స్పష్టంగా బోధపడుతుంది. ఆనాటి మధ్యతరగతి దైవికంగా కొన్ని ఉద్యోగాలు వెలగబెట్టింది కానీ వాటికోసం పోరాడిన దాఖలాలు లేవు. కానీ స్వాతంత్ర్య అనంతర చరిత్రలో చూస్తే గత అఱవయ్యేళ్ళలో భారతదేశంలో జరిగిన అన్ని ఉద్యమాలూ ఉద్యోగాల కోసమే. ఇంక దేని గుఱించీ పోరాడలేని దుస్థితికి ఈ "మధ్యతర గతి" ఎలా వచ్చింది ? అసలిది మధ్యతరగతేనా ?

ఇది వాస్తవంగా మధ్యతరగతి కాదు. వీరు ప్రభుత్వ సబ్సిడీలతో చదువుకున్న నిఱుపేదవర్గం. వీరిలో హెచ్చుశాతం మంది తమతమ వంశాల్లో తొట్టతొలి పట్టభద్రులు (First generation gradutaes), లేదా అధమపక్షంలో రెండో తరం పట్టభద్రులు. వీరు పైకి రావడానికి తమ సబ్సిడీ చదువూ, తద్ద్వారా వచ్చిన ఉద్యోగాలూ తప్ప వేఱే పెట్టుబడీ, వనర్లూ లేవు. అందుచేత అందఱికీ వీరు అదే మార్గాన్ని బోధిస్తారు. అటువంటి నేపథ్యం నుంచి రావడం చేత ఎలాగో ఒకలా చచ్చీచెడీ మనుగడ సాగించడం తప్ప వీరి దృష్టిలో పెద్ద పెద్ద ఆలోచనీయాంశాలేమీ ఉండవు. వీరిలో కొద్దిమంది తమ ఉద్యోగాల ద్వారా బాగా పైకొచ్చినాక కూడా పూర్వసంస్కారవశాత్తు అభ్యాసబలం చేత విషయాల పట్ల ఇదే విధమైన సంకుచిత ధోరణి కొనసాగిస్తారు. తమ జీవితాల్లో ఏనాడో చచ్చిపోయిన పేదఱిక పాముని జీవితాంతమూ కసిగా, అక్కసుగా, ఆవేశంగా చంపుతూనే ఉంటారు.

ఇది ఎలా జఱిగింది ? ఈ ఉద్యోగాలు లేకపోయినా ఒకప్పుడు బతికిన జాతి ఇవి తప్ప తరణోపాయం లేని దుర్గతికి ఎలా వచ్చింది ? అప్పటి మధ్యతరగతి ఇప్పుడెందుకు మాయమైంది ? గతమూ, భవిష్యత్తు అనే అడ్డ-నిలువుగళ్ళు అర్థం కాకపోతే వర్తమానపు క్రాస్ వర్డ్ పజిల్ ని పరిష్కరించడం అసాధ్యం. మన భారతదేశం యొక్క పేదఱికపు చరిత్రలో చాలామందికి తెలియని ఒక మిస్సింగ్ లింక్ ఉంది. అది - మన వృత్తుల్ని, మన ఉమ్మడి వనరుల్నీ బ్రిటిష్ పాలకులు తమ విదేశీ దిగుమతి వ్యాపారాల కోసం ఉద్దేశపూర్వకంగా సర్వనాశనం చేసిన వైనం. అందుకోసం వృత్తికారుల్ని కూడా చిత్రహింసలు పెట్టి హతమార్చడానికి, వారి ఉత్పత్తుల్నీ, గ్రామాల్ని తగలబెట్టడానికీ సైతం వెనుకాడని క్రౌర్యం. ఊరుమ్మడి భూముల్ని రైతుల నుంచి తప్పించి తమ తాబేదార్లుగా వ్యవహరించడానికి సిద్ధపడ్డ కొద్దిమంది జమీందారుల పరం చేసిన దురాగతం. ఇలా వనరుల్నీ, వృత్తుల్నీ, భూముల్నీ కోల్పోయిన కోట్లాది మంది బ్రిటిష్ ఇండియన్లు దిక్కూమొక్కూ లేనివాళ్ళయి, నానా వెట్టిచాకిరీల పాలై, నగరాల్లో కూలీలై, కార్మికులై, వ్యభిచారులై రోజురోజుకీ నికృష్టాతినికృష్టంగా దిగజాఱిపోయారు. వారి సంతానం పెఱిగింది, కానీ వారు అభివృద్ధి చెందలేదు. ఎన్ని సామ్రాజ్యాలు వచ్చినా పోయినా ఒకరి కింద పనిచెయ్యడమంటే ఏమిటో ఎఱుగనివాళ్ళు, తమ గ్రామంలో కులవృత్తి చేసుకుంటూ, ఒక సొంతయిల్లు, కొంత పొలమూ గలిగి గౌరవంగా బతికిన కుటుంబాలవారు అలా సర్వనాశనం చెయ్యబడ్డారు తొట్టతొలిసారిగా బ్రిటిష్ సామ్రాజ్యంలో !! బాగుపడ్డానికి బ్రిటిష్ వారు చూపించిన ఏకైక మార్గం తమ దగ్గర ఉద్యోగం చెయ్యడం. దానికి ఇంగ్లీషు విద్యార్హతలు నిర్ణయించారు. ఒకపక్క జనాన్ని ఈ రకంగా నాశనం చేసి ఇంకోపక్క భారతీయులందరికీ సమానంగా చదువుకునే అవకాశాన్ని చరిత్రలోనే మొట్టమొదటిసారిగా కల్పించామని గొప్పలు చెప్పేవారు. ఆ రకంగా ఇక్కడి స్వయంసమృద్ధమైన ఒకనాటి స్వయం-ఉపాధిక మధ్యతరగతి (self-employed middle class) ప్రణాళికాబద్ధంగా నిర్మూలించబడింది. ఆ అమానుషమైన నిర్మూలనాన్ని తట్టుకొని నిలబడ్డ బహుకొద్ది మంది మొండిఘటాలు మాత్రం అగ్రవర్గాలుగా మిగిలారు. తాము చేసిన పాపాల భారాన్ని చాలా కన్వీనియంట్ గా, చాలా తెలివిగా వాళ్ళ నెత్తిమీద రుద్దేశారు ఇంగ్లీషు వాళ్ళు. తాము చేసిన ఆర్థిక విధ్వంసం గుఱించి తమ చరిత్ర పుస్తకాల్లో ఎక్కడా పేర్కొనకుండా జాగ్రత్తపడ్డారు. అందుకే ఈరోజు మన చుట్టూ డెబ్భైశాతం రిజర్వుడు వర్గాలు.

అంతా ఒక పేదరికపు సముద్రంలా కనిపిస్తుంది.

చాలాసార్లు నాకింకోరకంగా ఆలోచించాలనిపిస్తుంది. పసితనంలో అభిరుచి అయినది యౌవనంలో ప్రవృత్తి అవుతుంది. ఆ తరువాత అది ఉపాధి అవుతుంది. ఒకరి విషయం లో ఉపాధి అయినది - అదే పదిమంది అవలంబిస్తే కులవృత్తి అవుతుంది. స్థానికంగా కులవృత్తి అయినది జాతీయస్థాయిలో పరిశ్రమ అవుతుంది. అందుచేత బ్రిటీషువాళ్ళు ఈ దేశానికి రాకుండా ఉంటే, వచ్చినా జోక్యం చేసుకోకుండా ఉంటే, ఆ వృత్తులు కొనసాగి ఉంటే - జపాన్ తరహాలో వాటినే ఆధునికీకరించుకొని ఉండేవాళ్ళం. మన మాదిగలు అంతర్జాతీయ చెప్పుల కంపెనీలు పెట్టి ఉండేవారు. మన పద్మసాలీలు టెక్స్ టైల్ మిల్లు లు పెట్టి ఉండేవారు.

బ్రిటీషువారి మూలంగా రాజరికాల నుంచి రాజ్యాంగబద్ధ రాజరిక-ప్రజాస్వామ్యం వైపు ఎలాగైతే ప్రయాణించలేకపోయామో, ప్రజాస్వామ్యం పేరుతో చట్టహీన అరాచకపు (law-less anarchy) ఇనప కౌగిట్లో ఎలాగైతే ఇఱుక్కున్నామో, అలాగే ఉపాధి విషయంలో కూడా అటువంటి సహజ చారిత్రిక పరిణామం నుంచి వంచితులమై ఎటో వెళ్ళిపోయాం. కానీ ఇప్పటికీ మించిపోయింది లేదు. కనీసం ఆధునిక కాలంలో అభివృద్ధి చెందిన కొత్త రంగాల్లో అయినా అటువంటి స్వతంత్ర ఉపాధిని విస్తారంగా ప్రోత్సహిస్తే జరిగిన చారిత్రిక నష్టాన్ని చాలావఱకు పూడ్చుకున్నట్లవుతుంది.

**వృత్తికీ ప్రవృత్తికీ, చదువులకీ, పరీక్షలకీ ఉద్యోగాలకీ సంబంధం తెగిపోయిన వైనం :**
ఉద్యోగాలు మనల్ని పోషిస్తాయనే ఆశతో మనం వాటికోసం వేశ్యల్లా ముస్తాబవుతాం. వాళ్ళు పెట్టే అర్థం పర్థం లేని పోటీపరీక్షల్లో విజయం సాధించడం కోసం జుట్టుపీక్కుని, మెదళ్ళు చించుకొని శీర్షాసనాలేసి కిందా మీదా పడతాం. వాస్తవం చెప్పాలంటే - వాళ్ళు పెట్టే పరీక్షల్లో అడిగే ప్రశ్నలేవీ మన జీవితానిక్కానీ, వారిస్తానంటున్న ఉద్యోగానిక్కానీ ఎంతమాత్రమూ పనికొచ్చేవి కావు. వాటికి Aptitude Test అనీ, Mental Ability అనీ ఘనమైన హుందా పేర్లు పెట్టినంతమాత్రాన వాటి నిరర్థకత్వాన్ని, మఱుగుపఱచ డం సాధ్యం కాదు. వాటిల్లో విజయం సాధించలేక ఆత్మహత్యలు చేసుకున్నవాళ్ళు కూడా ఉన్నారు. వాటిల్లో వైఫల్యం చెందితే అది అసమర్థత కాదు. ఎందుకంటే అవి మన సాధారణ విద్యావ్యవస్థ (regular stream of education) లో భాగం కాదు. వాటికి అభ్యర్థులు సంస్కారపరంగా సిద్ధం కావడం కుదరదు. అదీగాక మనిషి మేధకి ఒక లక్షణం ఉంది. ఏ విషయానికైనా అవసరమూ, అర్థమూ, పరమార్థమూ ఉంటేనే, లేదా అవి ఉన్నట్లు గ్రహిస్తేనే అది దాని పట్ల ఆసక్తి వహిస్తుంది. అప్పుడది దానికి గుర్తుంటుం ది, అబ్బుతుంది. ఉద్యోగార్థుల్ని వడపోయడమే వాటి లక్ష్యమని స్పష్టంగా బయటపడు తున్న పరీక్షల్ని మానవమేధ ప్రేమించజాలదు. ఈ మధ్య మన రాష్ట్రంలో తెలుగు, ఉర్దూ, హిందీ, సంస్కృతం టీచర్ ఉద్యోగాలకి దరఖాస్తు చేసిన అభ్యర్థులు ఇంగ్లీషు పరీక్ష కూడా రాయాలని ఉత్తర్వులు జారీ చేశారు. ఇందులో అర్థం పర్థం ఏమైనా ఉందో లేదో, పాపం ఆ అభ్యర్థులు అది రాయగలరో లేదో అదంతా మనం అడక్కూడదు. ఇచ్చేవాడికి పుచ్చుకునేవాడు లోకువ, అంతే ! ఒకవేళ ఆ నిర్భాగ్య అభ్యర్థులు ఆ పరీక్షక్కూడా సిద్ధ పడితే ఆ తరువాత నిబంధనలు సవరిస్తారు "తెలుగు టీచర్ అవాలంటే పులిపాలు తే వాలి, గుఱ్ఱపు గుడ్లు తేవాలి" అంటూ !

ఉద్యోగంలో చేరకముందే "నీ ఇంగ్లీషులో MTI (Mother Tongue Influence) factor ఉంది" మొదలైన వ్యాఖ్యలతో ఉద్యోగం అడిగిన పాపానికి వారు మన ఆత్మ గౌరవాన్ని పూర్తిగా నశింపజేసి, మనల్ని మానసికంగా ఉరితీసి, మన మీద మనకే అసహ్యం పుట్టేలా చేసి ఆనందిస్తారు. వాళ్ళ ముందు సెక్సప్పీల్ పెంచుకోవడం ఎలానో తెలుసుకోవడానికి చదవాల్సిన ప్రత్యేక పుస్తకాలున్నాయి. అందులో శిక్షణిచ్చే ప్రత్యేక గురువులున్నారు. వాళ్ళు మనకి రోజుల తరబడి ఎన్నో కృత్రిమ వ్యక్తిత్వ చిట్కాలు బోధించి, ఆషామాషీ ముఖాముఖులు (mock interviews) నిర్వహించి చివరిలో మాత్రం "Be calm and cool. Be yourself. Feigned personality turns off a potential recruiter" అని చేతులెత్తేస్తారు. Be yourself అనేవాడు అంత రుసుము తీసుకుని శిక్షణెందుకు ఇస్తున్నాడో మనకర్థం కాదు. లేని భుజకీర్తులేవో తగిలించుకుం దామనే కదా అక్కడికి మనం వెళ్ళింది ?

**కర్తవ్యనిర్వహణలో తాదాత్మ్యానికి అవకాశమేది ?** సరే, ఇంత కష్టపడి ఉద్యోగం సంపాదిస్తే అక్కడ జరిగేది - మన చేత పని చేయించుకుని జీతమివ్వడం ఒక్కటే కాదు. అనేక ఇతరేతర విషయాలు రంగంలోకి ప్రవేశిస్తాయి. మనకి తెలియకుండానే అనేక రాజకీయాల్లో పీకల్లోతు మునిగిపోతాం. కాలక్రమంలో అసలుద్యోగం కంటే అవే ముఖ్యమై కూర్చుంటాయి. ఉద్యోగం వస్తే చాలనుకుని వచ్చినవాళ్ళు ఆ తరువాత ఆ ఉద్యోగం బాగాలేదని గొణుగుతూండడం సర్వసాధారణం. భారతదేశంలో ఏ ఆఫీసుకైనా వెళ్ళి వినండి. అక్కడ జరిగే సంభాషణల్లో సగభాగం "ఎవడికి ఎంత జీతం వస్తోంది ? ఏ కంపెనీలో జీతాలు బావున్నాయి ? ఎవడు ఎంత అప్పులు తీసుకుని ఏయే ఆస్తులు సంపాదించేస్తున్నాడు ? ఎవడు ఎవడి ఉద్యోగవ్యాసంగానికి ఎసరుపెట్టాడు ?" అనేవాటి గురించి అయ్యుంటుంది. సబ్జెక్టు పెంచుకోవడం, సబ్జెక్టులో సరికొత్త పోకడలూ, పరిణామాలూ, ప్రాజెక్టుల్ని నిర్వహించడంలో మెళకువలు మొదలైన ప్రస్తావనలు చస్తే వినపడవు. ఉద్యోగం సంపాదించక ముందు మనం భౌతిక దరిద్రులమైతే, సంపాదించాక మానసిక దరిద్రులమవుతాం.

'మనం మన బాస్ కి మాత్రమే జవాబ్దారీ' అని మనం అనుకుంటాం. ఆ తరువాత అతడు మనల్ని చాలామందికి జవాబ్దారీని చేస్తాడు. మనం క్రమంగా మన ఆఫీసు నాలుగ్గోడలకి పరిమితమై పోతాం. చాలా కంపెనీల్లో ఏడాదికి పదిహేను యథాలాప సెలవులు (casual leaves) తీసుకునే సదుపాయం ఉంటుంది. అవి పేరుకు మాత్రమే యథాలాపం. చెప్పకుండా ఇంట్లో కూర్చుంటే గుడ్లెఱ్ఱ జేసే బాస్ లు ఎక్కువ. అవి ఉన్నా వాటిని వాడుకోలేని నిస్సహాయతే అన్నిచోట్లా ! మన పిల్లలు ఎలా చదువుతున్నారో తెలుసుకునే అవకాశం ఉండదు. వాళ్ళకి ఒంట్లో బాలేకపోతే ఎవరికో అప్పగించి రావడమే. మన దగ్గఱి బంధువు రాకరాక వస్తూంటే స్టేషన్ కెళ్ళి తీసుకొచ్చే ఆస్కారం ఉండదు. మన శరీరం మీదే మనం అదుపు కోల్పోవడం మొదలవుతుంది. మన గుఱించి మనం తిండి తినడం, మన గుఱించి బాత్ రూమ్ కెళ్ళడం మానేస్తాం. ఎందుకంటే మనం ఎన్నిసార్లు బాత్ రూమ్ కెళుతున్నామో ఓ కంట కనిపెట్టే పాకీవాళ్ళు కొంత మంది మన పక్క సీట్లోనే ఉంటారు. ఒంట్లో ఎంత బాలేకపోయినా తూలిపోతూ, సోలిపోతూ ఆఫీసు కెళ్ళడం అలవాటు చేసుకుంటాం. అలా అలా మొదట్లో బతకడం కోసం ఉద్యోగం చేసే స్థితి నుంచి, తినడం కోసం ఉద్యోగం చేసే దశ నుంచి ఉద్యోగం కోసమే బతకడానికీ, ఉద్యోగం కోసమే తినడానికీ దిగజాఱిపోతాం. మఱోపక్క మన ఆఫీసు జీవితాన్నే కాక మన కుటుంబజీవితాన్ని, మతజీవితాన్నీ కూడా అదుపులోకి తీసుకోవడానికి బాస్ ప్రయత్నిస్తూంటాడు. మనం ఏ దుస్తుల్లో ఉండాలో అతను చెబుతాడు. మనం తిలకధారణ చెయ్యాలో లేదో అతను నిర్ణయిస్తాడు. మనం ఏ భాషలో వ్యవహరించాలో అతను తేలుస్తాడు. అతనిచ్చే జీతం రాళ్ళ కోసం మనదనుకున్న ప్రతిదాన్నీ వదులుకోవడమే మన కర్తవ్యం. అసలు పనివేళల కంటే ఒక పది నిమిషాలు ముందు రావాలంటూ తాఖీదులు జారీ చెయ్యడంతో మొదలవుతుంది జోక్యం. తరువాత "ఈరోజు మీటింగ్ ఉంది" అంటూ ఇంకో తాఖీదు వస్తుంది. ఆ మీటింగులు అర్థం కాని కార్పొరేట్ ఇంగ్లీషులో దంచబడుతూంటాయి. మాట్లాడినవాడికి తప్ప ఇంకెవడికీ అర్థం కాకపోవడం వాటి ప్రత్యేకత. ఎంత అర్థం కాకుండా వాగితే అంత గొప్ప కార్పొరేట్ నాయకత్వం అన్నమాట. కంపెనీల్లోకి గిడుగు రామ్మూర్తులు రావడం ఎందుకో ఆలస్యమవుతోంది..

"Dear Friends ! Your Company's long-standing unbeatable brand equity is in for a dramatic mega metamorphosis with the brightening prospects of our acquisition of a few locally well-entrenched franchisees in the same line of activity, giving us an indomitable edge which will come handy in jacking up our market share in the country.... blah.. blah... blah... blah........" అంటూ ఏదేదో పిచ్చివాగుడు వాగుతారు. తమ కంపెనీ గొప్పతనాల గురించి వాళ్లు ఈ విధంగా బహిరంగ భావప్రాప్తులు (orgasms) పొందుతూ రాత్రి ఊరంతా మాటుమణిగే దాకా ఉద్యోగులకి చచ్చేంత బోరెక్కించి చావగొడతారు. ఎందుకంటే నీ సమయాన్ని వృథా చేసే హక్కు నీ బాస్ కి మాత్రమే ఉంది. ఈ చెత్త మీటింగుల కోసం పనివేళలకి మించి జనాన్ని కార్యాలయ భవనాల్లో తఱచుగా బంధించడం - తమ గొప్పతనాన్ని చూపించడానికీ, ఉద్యోగుల మీద మానసికంగా పట్టు సాధించడానికి, వాళ్ళల్లో వినయవిధేయతల్ని పెంపొందించడానికి మాత్రమే. ఏ విధమైన అదనపు ఉత్పాదకతా ఉండదు.

ఈ ఉద్యోగాలు చెయ్యడంలో మగతనం ఏముంది ? మగతనాన్ని భారీగా తగ్గించుకుంటే తప్ప వీటికి మనం పనికిరాము.

**నాలాగా వితంతువై వెయ్యేళ్ళు వర్ధిల్లు :** Head honchos అనబడే కార్పొరేట్ యజమానుల్లో ఎవరిని కదిలించినా తన గుఱించి ఒక సంక్షిప్త కాశీమజిలీకథ చెప్పుకుంటాడు. తానెంత కష్టపడి పైకొచ్చాడో, అది సమకాలీన యువతరానికి ఏ విధంగా ఆదర్శ ప్రాయమో రంగురంగులుగా వన్నెలు చిన్నెలుగా వర్ణిస్తాడు. అది విన్నాక కర్తవ్య నిర్వహణ పట్ల, బాస్ పట్ల అప్పటి దాకా మనకున్న వైఖరికి మనం సిగ్గుతో చితికిపోయి, పశ్చాత్తాప్పడి కంపెనీ పట్ల ఇనుమడించిన అంకితభావంతో నడుం కట్టేలా ఉంటాయి ఆ ఉపన్యాసాలు. ఏంటబ్బా అంతగా వాళ్ళు పడ్డ కష్టం ? వాస్తవానికి వాళ్ళు తమ వ్యాపారపు తొలిరోజుల్లో మాత్రమే కష్టపడతారు. ఆ తరువాత జీవితాంతమూ ఇతరుల్ని తమకోసం కష్టపెడతారు. వాళ్ళు పనిచేసి బాగుపడ్డ రకాలు కారు, ఏనాడూ ఇతరుల్ని బాగుచేసిన రకాలు కూడా కారు. ఇతరుల చేత అమానుషంగా, క్రూరంగా పనిచేయించి, ఆ విజయాల్ని, ఘనతల్ని వ్యక్తిగతంగా తమ కాపాదించుకుని తాము బాగుపడ్డ రకాలు మాత్రమే. బహుశా జీవితంలో ఏదో ఒక కాలఖండంలో వాళ్ళు కూడా సజ్జనులై ఉండొచ్చు. కాదనడానికి లేదు. కానీ, ఆ మంచితనం ఆనాడు వారికి జీవితమైతే ఈనాటి మంచితనం నటన మాత్రమే. స్వయంగా రిస్కు తీసుకోవడమంటే వాళ్ళకి ఎంత గుండె గాభరా అంటే - ఉద్యోగులు సమస్యల పరిష్కారం కోసం నేరుగా తమని సమీపిస్తారేమోననే భయంతో వారికీ, తమకీ మధ్య ఫైర్ వాల్సులా చాలామంది మధ్యవర్తుల్ని నియమిస్తారు. "అహ్ ! అలాగా ? అయితే Personnel Manager ని కలవండి. FM ని కలవండి. వాణ్ణి కలవండి. వీణ్ణి కలవండి. ఎల్లుండి Staff Meeting పెడుతున్నాం, మీ యూనియన్ లీడర్/ సెక్షన్ ఆఫీసర్ తో ఫార్వార్డ్ చేయించండి. విషయమేంటో రాసివ్వండి, నేను హెడాఫీస్ కి ఫార్వార్డ్ చేస్తాను" ఇవీ మనకి అడుగడుగునా వినిపించే నిర్లక్ష్యపూరిత సమాధానాలు.

వీళ్ళలో ఉద్యోగాలమ్ముకున్నవాడొకడు, జీతాల్లో ప్రతినెలా కమీషన్ కొట్టేసినవాడొకడు, ఉద్యోగుల్ని బర్తరఫ్ చేసినప్పుడు గానీ ఉద్యోగులే విరమించుకున్నప్పుడు గానీ జీతం ఇవ్వకుండా ఎగ్గొట్టినవాడొకడు, విరమించుకున్న ఉద్యోగుల గురించి రిఫరెన్సుగా ఇతరులకి తప్పుడు భోగట్టాలిచ్చేవాడొకడు, వాళ్ళ గురించి తప్పుడు ఆరోపణలతో పత్రికా ప్రకటనలిచ్చేవాడొకడు, ఒకే రిజిస్ట్రేషన్ నంబరుతో నాలుగైదు వాహనాలు నడిపేవాడొకడు, పన్నులెగ్గొట్టడం కోసం ఒకే భవనం ముందు రెండు, మూడు ఠెక్కమానులు (sign boards) వేళ్ళాడదీసినవాడొకడు, బ్యాంకుల దగ్గఱ అప్పు తీసుకుని ఉద్దేశపూర్వకంగా దివాలా ఎత్తినవాడొకడు, భాగస్వాముల్ని హింసించి/ చంపించి/ బెదిరించి/ వంచించి వ్యాపారాన్ని స్వాధీనం చేసుకున్నవాడొకడు - ఇలా ఈ ఉద్యోగాలిచ్చేవాళ్ళలో పవిత్రుడెవరో కనిపెట్టడం కష్టం. అందుచేత తమ డబ్బుకి ఒక పవిత్రతని ఆపాదించుకోవడం కోసం, తమ గతానికి ఒక మానవీయ ముఖాన్ని తగిలించుకోవడం కోసం చెబతారు వీళ్ళు తమ గుఱించి తామీ సిందుబాద్ సాహసయాత్రల కథలు. వీళ్ళు నీచులని తెలిసీ జనం వీళ్ళ గుఱించి మాట్లాడక పోవడానికీ, పోరాడలేక పోవడానికీ కారణం నిస్పృహయత. అయితే ఈ పరిస్థితిని సదరు దుష్టులు ఇంకోలా మార్చి చెప్పుకుంటారు. "We don't force anyone to be with us." అవతలివాళ్ళ నిస్పృహయతని సొమ్ము చేసుకునే పెక్కుమంది నాలుక కొస నుంచి తఱచుగా జాలువాఱే శ్రీసూక్తి ఇది. చిత్రమేంటంటే, పాపం ! "ఎవరినీ బాధించడం ఎఱగని ఈ అహింసామూర్తులు" ఎంతగా జీతాలిచ్చి పోషిస్తున్నా జనంలో వీళ్ళ పట్ల సదభిప్రాయం లేకపోవడం.

వీళ్ళని చూస్తే కష్టపడి పైకి రావడం మీదనే నమ్మకం నశిస్తుంది. "జన్మజన్మలకీ వద్దురా బాబూ ! ఈ కష్టపడ్డాలూ, పైకి రావడాలూ" అనిపిస్తుంది. కష్టపడి పైకొచ్చినవాళ్ళు ఇంత పిసినిగొట్లుగా, ఇంత అమానుషులుగా ఉంటారా ? అనిపిస్తుంది. ఏమో మఱి ! మనుషులు ఒక విషయంలో కంప్యూటర్ల కంటే భిన్నం కారు. కంప్యూటర్ లో ఏ మృదుసామాను (software) ఎక్కిస్తే దాన్నే చూపిస్తుంది. మనుషులు కూడా తాము పొందిన అనుభవాల్నే ఇతరులకిస్తారు. మనిషి చిన్నతనంలో అత్యంత బాధాకరమైన అనుభవాల్ని పొందినాక ఆ తరువాత అతనికి సుఖపడే దశ వచ్చినా తన గతం మీద జీవితాంతమూ కసి తీర్చుకుంటూనే ఉంటాడేమో ! మఱో తలం (plane) లో ఆలోచించి నప్పుడు, మన మంచీ, చెడూ మన అనుభవాలకి మనం ఎలా స్పందించడానికి నిశ్చయించుకున్నామనేదాన్ని బట్టి ఉంటాయి. అతిగా వల్లమాలిన కష్టం పడడమూ, అసలు కష్టమంటేనే

తెలియక పోవడమూ - రెండూ సమానంగా మానసిక లోపాలకి దారి తీస్తాయను కుంటా.

తమ Big Money ని చూసి నిబిడాశ్చర్యంతో చొంగలు కార్చే హిపోక్రిటికల్ మధ్యతర గతి ఉండడం నడమంత్రపు సిరిగాళ్ళకి చాలా ముఖ్యమైన విషయం. వాళ్ళు ఏవైతే చేసి పైకొచ్చారో ఆ వెధవపనులకి సమాజంలో ఈ వర్గం ద్వారానే ఆరాధనా పూర్వకమైన ఆమోదముద్ర లభిస్తుంది. అసలు ఈ మధ్యతరగతి ఆశపోతుల ద్వారానే వాళ్లు సమా జాన్ని అవినీతికూపంలోకి తోసేస్తారు కూడా ! పైగా మధ్యతరగతిలో అందరికీ కాకపోయి నా కొంతమందికైనా భారీ జీతాలిచ్చి పైపదవులివ్వడం వారికి విధాయకం. తద్వారా ఇది ఒక ప్రతిభాధారిత సమాజం (meritocracy) అనీ, ఇక్కడ కష్టపడే వాడికే స్థానమనే వృథాభ్రమని, వెట్టివెంగళాయితనాన్ని మిగతా సమాజంలో వ్యాపింపజేయడానికీ ఇలాం టి చర్యలు ఉపకరిస్తాయి. ఆ భ్రమలో ప్రతి మధ్యతరగతివాడూ తన వంతు/ తన కొడుకు వంతు కూడా ఏదో ఒకరోజున వస్తుందని ఆశగా కాచుక్కూచుంటాడు. అందుకని అత్యంత ఖరీదైన ఇంగ్లీషు మీడియమ్ బళ్ళలో సంవత్సరాల తరబడి డబ్బు తగలేస్తూం టారు. అలా తగలేస్తూ, తాము కోరుకున్న Big money ఇహ బెత్తెడే దూరముందని తెగ ఫీలై పోతూంటారు. మళ్ళీ అక్కడ కూడా ఆ స్కూళ్ళనబడే లాటరీ వ్యాపారం ఇంకో Big money వాలా చేస్తూంటాడు. ఏతావతా మొత్తమ్మీద మనలో Big Money యందు ఎనలేని మూఢవిశ్వాసాన్ని కలిగించడమే వీళ్ళందరి లక్ష్యమూ.

ఈ Big money పట్ల ఆరాధనాభావం మన సమాజాన్ని, కుటుంబాల్ని సంస్కార పరంగా ఎలా క్రుంగదీసిందంటే - ఈ రోజుల్లో ఆడవాళ్ళు కూడా ఉద్యోగాలు చెయ్యడం వల్ల వాళ్ళక్కూడా డబ్బు విషయాలు బాగా తెలిసిపోయాయి. Big money కొట్టెయ్య లేని మగవాడు వాళ్ళకీ, వాళ్ళ తలిదండ్రులకీ మగవాడిలా కనిపించడం లేదు. ఒకప్పటి ఆడది తన భర్త ఇంటికి తెచ్చినదాన్తో సంతోషపడేది. ఆ మాత్రం దానికే ఆమె అతని కష్టాన్ని కష్టంగా గుర్తించి ఎంతో ప్రేమించేది. అలాంటివాళ్ళు కొద్దిమంది ఇప్పటికీ అక్క డక్కడ మారుమూల కుగ్రామాల్లోను, చిఱుపట్టణాల్లోను లేకపోలేదు. Big money ముందు పట్నవాసపు మగవాడి వ్యక్తిగత ఆకర్షణ దిగదుడుపైంది. సమాజంలో ఇతరు ల్లాగా Big money సంపాదించలేని భర్త పట్ల ఆడవాళ్ళలో నిరసన, చులకనభావమూ, బహిరంగ అవిధేయత ఎక్కువయ్యాయి. చిన్నచిన్న మనస్తాపాలకే ఆత్మహత్యలు చేసు కోవడం కూడా పెచ్చుమీఱుతోంది. అందుచేత ఒకప్పుడు వందల్లో లంచాలు తీసుకునే వాడు కాస్తా, పెళ్ళాం దగ్గఱ హీరో అనిపించుకోవడం కోసం ఇప్పుడు కసిగా కక్షగా ఆబగా "వేలూ, లక్షలూ" అనుకుంటూ సమాజం మీద పడ్డాడు. తత్ఫలితంగా ఒకప్పుడు ఎవరూ పట్టించుకోని వార్డు మెంబరు, కౌన్సిలరు, టౌన్ ప్లానింగ్ గుమాస్తా లాంటి ఉద్యోగాలు/ పదవులు చేసేవాళ్ళ దగ్గఱ కూడా కోట్లాది రూపాయల ఆస్తులు పోగుపడ్డం జరుగు తోంది. పర్యవసానంగా గత పదిహేనేళ్ళలో ఆ ఉద్యోగాలకీ, పదవులకీ గిరాకీ అమాంతం పెఱిగిపోయింది. అలాగే బంగారం ధర కూడా ఆకాశాన్నంటింది.

**మధ్యతరగతి దృక్పథం మారాలి :-** మొదటి కోటి సంపాదించడం దైవాధీనం. రెండో కోటి సంపాదించడం కష్టం. అటుపిమ్మట గట్టిగా ప్రయత్నిస్తే మూడో కోటి సంపాదించడం అసాధ్యం కాదు. ఆ తరువాత నాలుగో కోటి, అయిదో కోటి సంపాదించ నక్కఱలేదు. అవి అలా నడుచుకుంటూ వచ్చేస్తాయంతే ! ఇదీ డబ్బు తత్త్వం. దేశంలో బహుకొద్దిమందికి నిరంతర ధనకనక వర్షాలూ, మిగతావాళ్ళందరికీ పచ్చడి మెతుకులూ మిగలడానికి ఇదే కారణం. ఈ దృష్ట్యా చూసినప్పుడు కార్పొరేట్ యజమానులు పడ్డ కష్టం ఏ పాటిదో మనకర్థమవుతుంది. అయితే ఇందులో మధ్యతరగతివాళ్ళకి అర్థం కాని రహస్యం ఇంకొకటి ఉంది. అది - డబ్బుని చూసే విధానం.

మధ్యతరగతివాళ్ళకి సాకల్య విలువలే తప్ప స్థానీయ విలువలు తెలియవు. అంటే ఒకడి జీతం లక్ష రూపాయలైతే, దాన్తో చాలా కొనుక్కోవచ్చునని వాళ్ళకి తెలుసు. కానీ ఆ లక్షలో పదిహేనువేల ఆఱొందల ముప్పై రెండో రూపాయి యొక్క విలువేంటో వాళ్ళకి తెలియదు. ఎందుకంటే మధ్యతరగతివాళ్ళకి కష్టపడ్డం మాత్రమే తెలుసు. ఆ కష్టాన్ని ఏ ధరకి అమ్ముకోవాలో, ఎలా అమ్ముకోవాలో వాళ్ళకి తెలియదు. వాళ్ళకి చదు వులు చదవడం ఒక్కటే తెలుసు. ఆ చదువుని తమకోసం ఉపయోగించుకోవడం తెలి యదు. ఒకవేళ ఎవడైనా తమకి పెద్దయెత్తున జీతమిస్తూంటే వాడు అలా ఎందుకిస్తు న్నాడో వాళ్ళకి తెలియదు. ఇవ్వకపోతే ఎందుకివ్వడంలేదో అది కూడా వాళ్ళకి తెలి యదు. కానీ కార్పొరేట్ యజమానులకీ, ఆ మాటకొస్తే రోడ్డు పక్కన కిరాణా దుకాణ

దారుకీ సాకల్య విలువలతో పాటు, స్థానీయ విలువలు కూడా లెస్సగా తెలుసు. కనుక వ్యాపారులు లక్ష్యాల వారీగా జీవిస్తూంటారు. మధ్యతరగతివాళ్ళు నెలవారీగా జీవిస్తూంటారు. అందుచేత వాళ్ళు డబ్బు కూడబెడతారు. మధ్యతరగతివాళ్ళు మాత్రం నానా అనవసర విషయాల మీదా, గొప్పల మీదా, అప్పుల మీదా డబ్బు తగలేస్తారు. ఎందుకంటే, "నెల తిరిగేసరికి మళ్ళీ చేతుల్లో డబ్బులాడతాయిలే" అనే ఒక తప్పుడు మానసిక భరోసాలో వాళ్ళు జీవిస్తూంటారు. అది వాళ్ళనీ, వాళ్ళ సంతానాన్నీ శాశ్వతంగా ఉద్యోగులుగాను, మధ్యతరగతి జీవులుగాను ఉంచేస్తుంది. వ్యాపారులకి, స్వయం-ఉపాధికులకీ ఆ మానసిక భరోసాలేమీ లేవు. కఱువుల్ని ఎదుర్కోవడానికి వాళ్ళు నిరంతరం సిద్ధంగానే ఉంటారు. కాబట్టి వాళ్ళ దగ్గఱ వనర్లు పోగుపడి ఉంటాయి. అందుచేత ప్రపంచంలో నిజంగా ఉన్నది Haves and have-nots కాదు, Saves and save-nots మాత్రమే. మధ్యతరగతివాళ్ళు దుబారా మనుషులై వ్యాపారుల్నీ, పారిశ్రామికవేత్తల్నీ బాగుచేస్తారు. ఇంటికొచ్చిన బంధువులకి విందులంటూ, బట్టలంటూ వాళ్ళు సాలుసరి చాలా డబ్బు తగలేస్తారు. ఇలా తగలెయ్యడం ఒక సత్సంప్రదాయంగా చెలామణి అవుతోంది. దాన్నే జీవితాంతం పొదుపుచేస్తే తమ కొడుక్కి/ కూతురికి ఉపాధి కల్పించగలుగుతారు. చదువుల పేరుతో వాళ్ళని హింసించాల్సిన అగత్యం ఉండదు.

అసలు Big money వాలాలు మనకి ఉపాధి కల్పిస్తున్నారా ? లేక ఉన్న ఉపాధి ఊడగొడుతున్నారా ? వీళ్ళూ, వీళ్ళ సంస్థలూ మూతపడితే అది మనం గుండెలు బాదుకోవాల్సిన విషయమేనా ? వీళ్ళతో పాటు పరమ పతివ్రతల్లా మనం కూడా సహగమనం చెయ్యాల్సిందేనా ? వీళ్ళు పడిపోతే ధరలు పెరుగుతాయా ? లేక ధరణికి దిగొస్తాయా ?

చిన్న వ్యాపారాల్నీ, స్థానిక వృత్తుల్నీ దెబ్బ కొట్టి, లక్షలాది మందిని వీధుల పాలు చేసి, కూలీలుగా మార్చి తమని తాము విస్తరించుకున్న సంస్థలివి. ఏ అర్హతలూ అవసరం లేని వృత్తులకి సైతం ఇంగ్లీషు విద్యార్హతలు నిర్ణయించి కోట్లాదిమందిని ఉద్యోగాల విపణి (job market) కి దూరం చేసిన మహానుభావులు వీరు. చాలా సంవత్సరాల క్రితం జిల్లా సంచికలు (district editions) ప్రారంభించి, స్థానిక చిన్న పత్రికల్ని పడగొట్టి తన పాఠక వర్గాన్ని పెంచుకున్నాడొక పత్రికాధిపతి. తద్వారా అప్పట్లో రాష్ట్రవ్యాప్తంగా చాలామంది ఉపాధి కోల్పోయారు. మఱోపక్క అప్పట్నుంచి రాష్ట్రంలోని పత్రికాపాఠకులకి పక్క జిల్లాలో ఏం జరుగుతోందో తెలుసుకునే భాగ్యం కూడా కఱువైంది. రెండేళ్ళ క్రితం Big money వాలాలు చిల్లఱ/ కిరాణా/ పచారీ కొట్ల వ్యాపారంలోకి ప్రవేశించి స్థానిక కిరాణా వ్యాపారుల్ని దెబ్బకొట్టడానికి కంకణం కట్టుకున్నారు. ఈ ఆర్థికసంక్షోభం రాకపోతే వాళ్ళు తమ పథకాన్ని జయప్రదంగా అమలు జఱిపి ఉండేవాళ్ళు. సొంత దుకాణాల వాళ్ళు వాళ్ళ దగ్గఱ కూలీలుగా మారేవారు. వాళ్ళు లక్షలాదిమందిగా ఉన్నా సరే, వాళ్ళ ఉపాధి దెబ్బదింటే దానికి బాధపడ్డానికి మనకు మనసు రాదు. కానీ ఒక బ.జా.స (MNC) కూలిపోయిందంటే మాత్రం హాహాకారాలూ, ఆర్తనాదాలూ, పెడబొబ్బలూ ! ఎందుకంటే ఉన్నవాడి నొప్పికి మాత్రమే ఉలిక్కిపడుతుంది సమాజం.

అత్యల్ప జనాభా, అత్యధిక ఎగుమతి వ్యాపారాలూ గల దేశాల జీవనప్రమాణాల (Standards of living) ని ఆదర్శంగా చూపించడం ఒక మోసం. మన జీవనప్రమాణాలు అలా లేకపోతే క్రుంగిపోవడం హాస్యాస్పదం. ఆ ప్రమాణాల కంటే కూడా మన స్థానిక అవసరాలూ, సాంస్కృతిక ఇష్టనిష్టాలూ మన జీవనశైలిని నిర్ణయిస్తాయి. పాశ్చాత్య దేశాల్లో తలసరి కాయితం వాడకం ఎక్కువని, ఇక్కడ తక్కువనీ ఏడిచేవాళ్ళు ఆ కాయితాల లెక్కలో ఆ దేశాల బాత్ రూమ్ అవసరాలు కూడా కలుస్తాయని మర్చిపోతారు. అలాగే ఏదో దేశంలో అన్నీ పరిశ్రమలే ఉన్నాయని ఇక్కడ కూడా అదే మాదిరి ఆర్థిక వ్యవస్థ కావాలనుకోవడం అవాస్తవిక దృక్కోణం. ఈ తప్పుడు అవగాహనల్ని ప్రచారం చేసేవారు అలాంటిది ఈ దేశంలో ఎలా సాధ్యపడుతుందో మాత్రం ఏనాడూ విశదంగా వివరించిన పాపాన పోరు. ఈ రాష్ట్రంలో ఏడాదికి నాలుగు లక్షల మంది నానారకాల పట్టాలు (degrees and diplomas) పుచ్చుకొని బయటికొస్తున్నారు. దేవుడు మేల్జేసి, వీళ్ళలో ఒక గణనీయ సంఖ్య గృహిణులుగా స్థిరపడబోతున్న ఆడపిల్లలు కాబట్టి బతికి పోయాం. లేకపోతే వీళ్ళందఱికీ పారిశ్రామిక రంగంలో ప్రత్యక్ష, పరోక్ష ఉపాధి కల్పించాలంటే ఏడాదికి కనీసం యాభైవేల కోట్ల రూపాయల పెట్టుబడి కావాలి. ఎక్కణ్ణుంచి వస్తుంది ? ఎవరివ్వబోతున్నారు ? ఒకవేళ ఇస్తే ఎలా తీర్చబోతున్నారు ? ఇవేవీ మనల్ని తర్కసహంగా ఆలోచించుకోనివ్వరు. గుడ్డెద్దు చేలో పడ్డట్లు ప్రతివాడూ "ఉద్యోగాలో ఉద్యోగాలు" అని ఒకటే గోల. మన కోసం ఎవరో కోట్లాది ఉద్యోగాలు పోసుక్కూచున్నట్లు, వాటిని చేజి

క్కించుకోవడం మనదే ఆలస్యమైనట్లు బళ్ళలో భావిపౌరులక్కూడా కాకమ్మ కతలు.

Big money (multi-billion) పెట్టుబడులతో సగటున ప్రతి పాతిక, ప్రతి యాభై లక్షలకి, లేదా ప్రతి కోటి రూపాయలకి ఒక ఉద్యోగం చొప్పున మాత్రమే కల్పించగలం. కానీ ఒక జూబిలీ హిల్స్ అపోలో ఆస్పత్రికి బదులు సరిగ్గా అదే ఖర్చుతో యాభై గ్రామీణ ఆస్పత్రుల్ని సకల సదుపాయాలతోను నిర్మించొచ్చు. ఒక పెద్ద ఆఫ్ సెట్ ముద్రణాలయాన్ని నెలకొల్పే బదులు అదే ఖర్చుతో పది నుంచి ఇఱవై చిన్న ఆఫ్ సెట్ ముద్రణాలయాల్ని నెలకొల్పొచ్చు ఒక కార్పొరేట్ పాఠశాలని కట్టే బదులు అదే ఖర్చుతో ఇఱవై గ్రామీణ పాఠశాలల్ని కట్టొచ్చు. ఉపాధి కూడా అదే స్థాయిలో పెఱిగిపోతుంది. ఆ ఉపాధి గ్రామీణ ప్రాంతాల్లో కూడా అందఱికీ లభిస్తుంది. ఎవరూ హైదరాబాదుకూ, విశాఖ పట్నానికీ వలసపోయే పని ఉండదు. స్థానిక గిరాకీ స్థిరంగా ఉంటుంది కనుక ఏ ఆర్థిక సంక్షోభాలూ వాటిని తాకజాలవు. కావాల్సిందల్లా అలాంటి చిన్న పూనుకోళ్ళ (ventures) విపణి (market) కి ప్రభుత్వం తరఫున చట్టపరమైన రక్షణ. పెద్దపెద్ద కార్పొరేట్ తిమింగలాల బారినుంచి రక్షణ. అయితే కోట్లాది రూపాయల పెట్టుబళ్ళని కూడా Small Scale Industries పరిధికిలోకి తెచ్చి నిజమైన చిన్నతరహా పరిశ్రమలకి చావుదెబ్బ కొట్టిన ప్రభుత్వమిది.

**కార్పొరేట్ స్వామ్యం :-** ఇలాంటివి ప్రోత్సహించడం మానేసి ఏం చేస్తున్నారు మన పాలకవర్గాలు ? వాళ్లు Big money వాలాల పథకాలకి అనుగుణంగా వాళ్ళకి అనుమతులు మంజూరు చేస్తున్నారు. బ్యాంకుల్లో మనం దాచుకున్న డబ్బంతా తీసుకెళ్ళి వాళ్ళ చేపట్టుల (projects) కి ఋణాల రూపంలో అందుబాటులో ఉంచుతున్నారు. వాళ్ళు ఎగ్గొట్టగా దివాలా తీసిన బ్యాంకులకి మళ్ళీ మన డబ్బులతోనే ఉద్దీపన పథకాలు (stimulus packages) ప్రకటిస్తున్నారు. వాళ్ళ గుత్తాధిపత్య ధోరణుల (monopolistic tendencies) కి అనుగుణంగా చట్టాలు కూడా చేస్తున్నారు. వాళ్ళ వాటా ధరలు (stock prices) పడిపోవడం గుఱించి తాము గుండెపోట్లు తెచ్చుకుంటూ, మనల్ని కూడా అలా తెచ్చుకోమంటున్నారు. వాటాల విపణి కుప్పకూలి ఊహాజనిత డబ్బు మాయమైతే అదేదో బ్రహ్మప్రళయంలా అభివర్ణిస్తున్నారు. మనం బ్యాంకుల్లో దాచుకున్న చిన్నచిన్న మొత్తాల మీద కూడా పైశాచికంగా పన్నులు వేస్తూ, మనకి బ్యాంకులంటేనే భయం పుట్టేలా చేసి, తద్ద్వారా సంయుక్తరాష్ట్రాల్లో మాదిరి యావత్తు మధ్యతరగతి డబ్బునీ ఘోర అనిశ్చితి కూపాలైన పరస్పర నిధులకీ, వాటాల విపణికీ తరలించాలని కుటిల పన్నాగం పన్నారు. అందులో ఇప్పటికే ఒక పాక్షిక విజయాన్ని సాధించారు కూడా !

మన గ్రామీణ ప్రాంతాల్లో ఆస్పత్రులూ, పాఠశాలల వంటి మౌలిక సదుపాయాలు తక్కువ. వాటిని ఏర్పఱుస్తామని ముందుకొచ్చే స్థానిక విద్యావంత యువతకి ఈ ప్రభుత్వాలూ, బ్యాంకులూ ఏ ఋణసహాయమూ చెయ్యవు. ఛప్పన్న వంకలు పెట్టి పైసా ఇవ్వకుండా తప్పించుకుంటాయి. అదే ప్రభుత్వమూ, బ్యాంకులూ నగరాల్లో పెద్ద కార్పొరేట్ సంస్థల చేపట్టుల (projects) కి తడుముకోకుండా ఇచ్చేస్తాయి. అంతేకాదు, ఆ పెద్ద మనుషులు టీవీ ఛానళ్ళూ, తాగుడు బార్లూ, సినిమా హాళ్ళూ పెట్టుకుంటామంటే కూడా కోట్లు మంజూరు చేస్తాయి. మఱి గ్రామాల్లో ఉపాధి ఎలా ఏర్పడుతుంది ? మఱి గ్రామీణులు నగరాలకి వలస రాకుండా, కార్మికులుగా మారకుండా, పట్నవాసపు పేదఱికాన్నీ, ముఱికివాడల్నీ, నేరాల శాతాన్నీ పెంచకుండా ఎలా ఉంటారు ? ఈ ప్రభుత్వం దృష్టిలో సొంతంగా ఏదైనా ప్రారంభించే హక్కు కేవలం నగరాలకి చెందిన Big money వాలాలకి, అందులోను ముసలివాళ్ళకి ప్రత్యేకించబడినట్లు కనిపిస్తున్నది. మరో కోణంలో, ప్రభుత్వం కుబేరుల శ్రేణినీ, కటిక పేదవాళ్ళనీ తప్ప చదువుకున్న మధ్యతరగతిని పూర్తిగా గాలికొదిలేసినట్లు గోచరిస్తోంది. గాలికొదిలేయడమే కాదు, వాళ్ళ సంక్షేమాన్ని, భవిష్యాన్ని ప్రైవేట్ Big money వాలాల దయాదాక్షిణ్యాలకి విడిచిపెట్టింది. నిష్ఠూరమైన నిజాన్నే మాట్లాడాల్సి వస్తే - ప్రభుత్వ సహాయాన్ని పొందే తొట్టతొలి అర్హత, పన్నులు సక్రమంగా చెల్లిస్తున్న విద్యావంత మధ్యతరగతికి మాత్రమే ఉంది. అందుచేత ముష్టి ఉద్యోగాల కోసమూ, వాటిల్లో నలుసంత ప్రత్యేకింపుల (reservations) కోసమూ కాకుండా దేశ (ప్రభుత్వ) సంపదలో తమక్కూడా ఉన్న న్యాయబద్ధమైన వాటా కోసం మధ్యతరగతి విద్యావంతులు పోరాడే రోజు రావాలి.

# నిరుద్యోగం పురుషలక్షణం

## మూడో అధ్యాయం

### మానవసంబంధాలకి ఉద్యోగం అపయోగం

ద్యోగాలనే భావన (concept) మన మనస్తత్త్వాల్ని తిప్పిన అష్టవంకరల పైనం బహు విచారకరమైనది. దాని పర్యవసానాలు బహు విషాదభరిత మైనవి. ఉద్యోగాలిచ్చేవాళ్ళు కుటుంబాన్నొక మానకం (unit) గా తీసు కుంటారు. అందుచేతనే ఒక ఉద్యోగి యొక్క కుటుంబం చాలినంత సదు పాయంగా బతకడానికి సరిపోయే మొత్తాన్ని సెలజీతంగా ఇస్తారు. వ్యక్తినొక మానకంగా తీసుకొని అతను చేసిన పనికీ, అతను మాత్రమే బతకడానికీ సరిపోయే మొత్తాన్ని ఇస్తే కోట్లాది మంది ఆత్మహత్య చేసుకోవాల్సి వస్తుంది. కానీ ఉద్యోగాలు చేసేవారు మాత్రం వ్యక్తిని - అంటే - తమని తాము ఒక మానకంగా పరిగణించుకుంటారు. కానీ ఏ సాంప్ర దాయిక సమాజంలోను - అది ఇండియా అయినా, ఇంగ్లండయినా, హిందూమతమైనా, ఇస్లామైనా - వ్యక్తి ప్రాథమిక మానకం కాదు. ప్రపంచంలోని అన్ని జాతీయ, మత, ధార్మిక సంప్రదాయాలూ కుటుంబాన్ని ఒక ప్రాథమిక మానకంగా పరిగణిస్తాయి. ఒక కుటుంబానికి కొంత పొలం ఉందంటే అందులో ఆడా, మగా, చిన్నా, పెద్దా అందఱూ ఎంతోకొంత ఒక చెయ్యి వేస్తారు. Team work లాంటి మాటలెవరూ వాడరు. కానీ వాళ్ళు చేసేది అదే. పంట పండితే అందఱూ సంతోషిస్తారు, పండగ చేసుకుంటారు. "ఈ బస్తా నాది, ఈ చెక్క నాది" లాంటి మాటలు మనకి వినపడవు. కమ్మరి, కుమ్మరి, వడ్రంగి, కంసాలి సంసారాల్లో కూడా అందఱూ అదే పని చేస్తారు. ఆదాయాన్ని అందఱూ కలిసి అనుభవిస్తారు. నష్టాన్ని అందఱూ కలిసి భరిస్తారు. కిరాణా కొట్లలో భర్త ఇంటికెళితే భార్య కొట్లో కూర్చుని వ్యవహారం నడుపుతుంది.

కానీ ఉద్యోగాలు చేసేవాళ్ళు మాత్రం తమ "వ్యక్తిగత కష్టార్జితం" గుఱించి మాట్లాడతారు. వాళ్ళలో బాధ్యతాభావం ఉండదని కాదు. "తమ సంపాదన తమ కుటుంబంలో అందఱికీ సమానంగా చెందుతుంది" అనే స్పృహ వాళ్ళలో ఉండడం అరుదు. కుటుంబ నిరపేక్షం గా తమకంటూ ఒక సొంత వ్యక్తిత్వం ఉందని వాళ్ళు భ్రమిస్తూంటారు. దాని జోలికి మనం పొఱపాట్న వెళితే మనల్ని అడ్డంగా నఱికేస్తారు కూడా ! అడుగడుగునా కుటుం బం తమ వ్యక్తిత్వ వికాసానికి దోహదం చేసిన చరిత్రని సుఖంగా మర్చిపోతారు. "నా ప్రతిభ, నా చదువు, నా సంపాదన, నా కష్టార్జితం, నా ఆస్తి" తాము చేసే పని మీదా, అందుకవసరమైన వనర్ల మీదా తమకి అదుపు ఉన్నవాళ్ళు, దాన్ని అభిమానంగా ఇష్టపడి చేసేవాళ్ళు ఇలాంటి స్వార్థపుటాలోచనలు చెయ్యరు. బానిసత్వంలోంచి, ఆ బానిసత్వం కల్పించిన మనోవ్యథలోంచి, ఆశించినవి ఆశించినట్లుగా నెఱవేఱలేదనే నిరాశోపహతి లోంచి పుడతాయి ఈ ఆలోచనలు. కొన్ని విషయాల్లో వ్యక్తిని మానకంగా తీసుకోవడం అనేది గాయపడ్డ చోట మందు రాయడం లాంటి ఒక ఆచరణాత్మక సౌలభ్య మే (practical convenience) తప్ప ఈ వ్యక్తివాదం ఒక తత్త్వశాస్త్రం కాజాలదని మర్చిపోతున్నారు. అయితే మన భారతీయ సమాజం ఇప్పటికీ "వ్యక్తిని మానకంగా తీసుకోవాలో, కుటుంబాన్ని తీసుకోవాలో" అర్థం కాని సందిగ్ధంలో పడి కొట్టుమిట్టాడు తోంది. అందుచేత ఈ దేశంలో రెండు రకాల చట్టాలూ పక్కపక్కనే అమల్లో ఉన్నాయి. ఆడవాళ్ళ విషయంలో వ్యక్తిని, మగవాళ్ళ విషయంలో కుటుంబాన్ని మానకంగా తీసు కునే ద్వంద్వవిధానం ఇక్కడ అమల్లో ఉంది.

సంపాదనకి సంబంధించి ఈ వ్యక్తివాదం అందఱినీ బానిసత్వంలోకి లాగి పారేయగల పెనువూబి. మొదట ఇందులో మగవాళ్ళు మునుగుతారు. తత్ఫలితంగా ముందు తండ్రీ కొడుకులూ, అన్నదమ్ములూ కొట్టుకు చస్తారు. "మీ మీద ఆధారపడే అవసరం నాకు లే"దంటూ విడిపోయి, పరస్పరం దూరంగా వెళ్ళి ఎవరి ఉద్యోగాల్లో వారు తలమునక లవుతారు. ఆ తరువాత అందులోకి ఆడవాళ్ళు దిగుతారు. ఎవరి ఆఫీసులు వారికీ, ఎవరి బాసులు వారికీ, ఎవరి బ్యాంకు ఖాతాలు వారికీ ఏర్పడి - ఒకపక్క ఆఫీసులో Team spirit పెఱిగిపోతూండగా ఇంట్లో మాత్రం తఱిగిపోతూంటుంది. పర్యవసానంగా భార్యాభర్తలు కొట్టుకు చస్తారు. విడిపోయినంత మాత్రాన గడవక పోవడమంటూ ఏమీ

లేదు గనుక ధైర్యంగా విడాకులు తీసుకుని విడిపోతారు. ఆ తరువాత అందులోకి పిల్లలు అడుగుపెడతారు. వాళ్ళు సాధారణంగా తల్లిపెంపకంలో పెఱిగిన వాళ్ళయి ఉంటారు. ఆమె ఆధిపత్య ధోరణి వాళ్ళకి మింగుడు పడదు. ఆమె ఆధిపత్యాన్ని సవాలు చేసే ఉద్దేశంతో గానీ, ఆమెకి సహాయంగా గానీ వాళ్ళు కూడా కౌమారప్రాయంలోనే ఏదో ఒక చిఱుద్యోగం వెతుక్కుంటారు. సంయుక్త రాష్ట్రాల (United States) జనాభా ముప్పై కోట్లయితే అందులో ఏదో ఒక రకమైన ఉద్యోగాలు చేసేవారి సంఖ్య పదిహేను కోట్ల మందికి పైనే. పద్దెనిమిదేళ్ళ లోపు వయసువాళ్ళు సైతం చదువు మానుకుని చిఱివిగా ఉద్యోగాల్లో ఉంటే తప్ప ఈ సంఖ్యకి చేఱుకోవడం సాధ్యపడదు. అలా వ్యక్తివాదం ఉద్యోగాలకీ, ఉద్యోగాలు వ్యక్తివాదానికీ పరస్పర దోహదం చేస్తూ ఏపుగా వర్ధిల్లుతూంటాయి. అందుకే ఇలాంటి సమాజాల్లో ఉద్యోగాలు పోతే బ్రహ్మాండం బద్దలవుతుంది.

ఉద్యోగాలు చేసేవాళ్ళలో ఒక విధమైన ఎడ్డెమడ్డి మనస్తత్త్వం అభివృద్ధి చెందుతోంది. అంటే తమ ఉద్యోగం తప్ప ఇంక ప్రపంచంలో ప్రతిదాని ఎడలా నిరసనభావం, చులకన భావం, నిర్లక్ష్యధోరణి. "నాకు సంబంధం లేదు...నాకు సంబంధం లేదు...నాకు సంబంధం లేదు..." ప్రతిదానికీ వాళ్ళు జపించే సప్తాక్షరీ మంత్రం ఇది. దీని జపసంఖ్య పెఱిగిపోయే కొద్దీ వాళ్ళలో వివేకవైరాగ్యాలు, నేతినేతివిచారణా, నిత్యానిత్యవిచక్షణా ముదిరిపోయి "తల్లితో సంబంధం లేదు, తండ్రితో సంబంధం లేదు, తమ్ముడితో సంబంధం లేదు, అన్నయ్యతో సంబంధం లేదు, చెల్లితో సంబంధం లేదు, బాల్యమిత్రుడితో సంబంధం లేదు, ఆఖరికి పెళ్ళాంతో కూడా సంబంధం లేదు, పిల్లలతో బొత్తిగా లేదు" అనే స్థాయికి వస్తారు. తమ బదులు వాళ్ళ బాధ్యత ఎవరైనా తీసుకుంటే బావుండుననీ, తాము నిశ్చింతగా ఆఫీసుకెళ్ళి పని చేసుకోవచ్చుననీ ఆలోచిస్తూంటారు, అసలు తామా ఉద్యోగం ఎవరి కోసం చేస్తున్నదీ మర్చిపోయి ! మఱికొందఱు తమ ఉద్యోగం తాము చేసుకుంటూ, తమ తిండి తాము తింటూంటే తమకి చెప్పడానికి తండ్రెవడు ? అన్నయ్య ఎవడు ? అని నీచాలోచనలు చేస్తూంటారు, విన్నా, వినకపోయినా తమకి ఏ విషయం మీదైనా చెప్పే హక్కు ఉన్న ఏకైక పెద్దలు వారేనని, వారికా అధికారం పుట్టుకతోనే సంక్రమించిందనే విషయం మర్చిపోయి. ఉద్యోగభావన ఈ రకంగా మన కుటుంబ సంస్కృతికి తలకొఱివి పెడుతున్న వైనం మిక్కిలి హృదయవిదారకమైనది.

సమాజంలో నీతి, నిజాయితీ లోపించడానికి ఉద్యోగాలు చేసే దోహదం పరిశోధనీయం. నీతికీ, అవినీతికీ మధ్య, కృషికీ, సోమరితనానికీ మధ్య - మనుషులు యజమానుల్లా పనిచెయ్యడానికీ, దాసులుగా పనిచెయ్యడానికీ మధ్య ఉన్నంత తేడా ఉంది. ఉద్యోగంలో చేఱకముందు ఎన్నో కష్టాలు పడి, ఎంతో కృషి చేసినవారు కూడా ఉద్యోగంలో చేఱాక కొంతకాలానికి సోమరులుగా మారిపోవడం, ఏ పనీ చెయ్యబుద్ధి కాకపోవడం జఱుగుతుంది. దీన్ని తెల్లవాళ్ళు Burn-out syndrome అని పిలుస్తున్నారు. దీనిక్కారణం - వాళ్ళు ఉద్యోగంలో చేఱి ఏవో లోకోత్తర సుఖాలకి మఱగడం కాదు. దాస్యభావంతో పని చెయ్యడం, ఇతరుల కోసం ఒకటే గాడిలో పడి అతిగా శ్రమించడం చివఱికి అలాంటి డస్సిపోకకూ, మానసిక ఆయాసానికీ, విసుగుకూ దారితీస్తుంది. ఈ వాస్తవాన్ని కప్పిపుచ్చి "హెడ్ హాంకోలు" ఏమంటారంటే - "People are known to die of cancer, AIDS and other diseases. But work is not a disease. Nobody has ever died of hard work." అని తమ చెణుకు (joke) కి తామే లబ్బున ముఱిసిపోయి నవ్వుకుంటారు. ఇది వీళ్ళు వినిపించే కార్పొరేట్ కాశీమజిలీ కథల్లో ఒక భాగం మాత్రమే. అసలు వీళ్ళకి hard work అంటే ఏంటో తెలుసా ? తెలిస్తే ఇలా మాట్లాడతారా ? ఏదయినా శ్రుతిమించి మితిమీఱితే జబ్బుగా మారుతుంది. ఆ తరువాత ఆ జబ్బు క్రమంగా మనిషిని చంపేస్తుంది. Hard work ఇందుకు మినహాయింపు కాదు. అతి సర్వత్ర వర్జయేత్. పని జబ్బు కాకపోవచ్చు. కానీ అతిగా పని చెయ్యడం - అది తన కొఱకైనా సరే - భయంకరమైన జబ్బులకు దారితీస్తుంది. నాలుక్కాస నుంచి అలవోకగా ఇలాంటి డైలాగులు కొట్టే హెడ్ హాంకోలు తమ ఉద్యోగుల్లో ఏ దీర్ఘకాలిక వ్యాధీ లేకుండా ఆరోగ్యంగా మిసమిసలాడుతున్నవాళ్ళు ఎంతమందో దాపఱికాల్లేకుండా బయటపెడతారా ?

మన ఉద్యోగదృష్టి మూలాన అన్నిటికంటే ఎక్కువగా, దారుణంగా దెబ్బతినిపోయిన రంగం విద్య. ఉద్యోగదృష్టి ప్రజల్లో ఒక సామూహిక ఉన్మాదాన్ని (Mass hysteria) ని సృష్టించింది. అందఱూ ఉద్యోగం చెయ్యొచ్చుననే భావన (concept) కాలక్రమంలో రూపు మార్చుకొని అందఱూ ఒకే ఉద్యోగం చెయ్యాలని, అందుకోసం అందఱూ ఒకే విధమైన చదువు చదవాలనీ, చదివి తీఱాలనే నిరంకుశ సామాజిక భావనకి దారితీసింది.

తద్వారా అందఱూ ఒకే కోర్సుకి ఎగబడ్డం స్వాతంత్ర్యానికి పూర్వనుంచే మొదలయింది. అంతేకాదు, ఆ ప్రత్యేక కోర్సు కాకుండా ఇంకేదైనా కోర్సు చేస్తాననేవాణ్ణి పరమ పనికి మాలినవాడి కింద జమకట్టడం, "వాడి బొంద ! వాడికే తెలివితేటలుంటే ప్రాచుర్యం (popularity) ఉన్న కోర్సులోనే చేఱేవాడు కదా !" అంటూ అన్ని ఇతర శాస్త్రాల్నీ అవమానించడం జఱుగుతోంది. ఈ వేలంవెఱ్ఱి, రుగ్మత ఎలా ముదిరిపోయిందంటే - అసలు ఆయా శాస్త్రాల అస్తిత్వాన్నే, వాటి సందర్భశుద్ధి (relevance) నే బహిరంగంగా, మూర్ఖంగా సవాల్ చేసేటంత మొఱటుదనానికి చేఱుకున్నారు. అభివృద్ధి చెందిన మానవ నాగరికతకి అన్ని సబ్జెక్టులూ అవసరమేనన్న ఇంగితం ఈ కాలంలో దయనీయంగా లోపించింది. తత్ఫలితంగా పెక్కు ప్రైవేటు విశ్వవిద్యాలయాల్లో మానవీయశాస్త్రాల్నీ (Humanities), భాషల్నీ ఎత్తేశారు. ఇంకొన్ని చోట్ల సాంకేతిక కోర్సుల్నీ, వ్యాపార నిర్వహణా కోర్సుల్నీ మిగిల్చి కేవల విజ్ఞానాల్ని (pure sciences) కూడా ఎత్తేశారు. శాస్త్రాల్లో కూడా అగ్రకులాలూ , నిమ్నకులాలూ బయల్దేఱాయి. వృత్తిరంగాలు (professional fields) మతాలుగా పరిణమించాయి.

మనిషి అనేవాడు రక్తమాంసాలు గలిగి, మనసూ, ఆత్మ మొదలైన అన్ని ఉన్నతస్థాయి హంగులతోను సృష్టించబడ్డ సంక్లిష్ట జీవి అనీ, అతనికి ఇష్టానిష్టాలు, ఆసక్తులూ, అభిరుచులూ, అటాచిమెంట్లూ, సెంటిమెంట్లూ గట్రా చాలా ఉంటాయనీ, అవి ఉండడమే మానవజాతికి మంచిదనే వాస్తవాన్ని మఱుగుపఱుస్తున్న ఈ విద్య కేవలం ఆ ముసుగులో చెలామణి అవుతున్న ఘోర అజ్ఞానాంధకారమూ, అవిద్య మాత్రమే. వేలాది సంవత్సరాల సమాజం యొక్క ఉమ్మడి నాగరికతా వారసత్వాన్ని భావితరాల దాకా కొనసాగించే అత్యద్భుత సాధనంగా విద్యని చూడ్డం మానేసి చాలా కాలమవుతోంది. దాన్ని తమ వైయక్తిక వ్యాసంగ (personal career) సాధనంగా భావిస్తున్న ఈ కాలపు విద్యావంతులు సంస్కారపరంగా ఛక్తు నిరక్షరాస్యులు. ఇలాంటి నిరక్షరాస్యుల్ని లక్షలాదిగా విశ్వవిద్యాలయాల్లో ఉత్పత్తి చేస్తున్నందుకూ, అందుకోసం డబ్బు తగలేస్తున్నందుకూ మనం సిగ్గుతో తలవంచుకోవాలి. ఈ విద్యావ్యవస్థ ఎలా తయారయిందంటే - ఒక శాస్త్రం పట్ల అభిరుచి ఉన్నవాణ్ణి అది చదవనివ్వరు. ఇంకో శాస్త్రం దగ్గఱికొచ్చేసరికి మాత్రం అదంటే ఆసక్తి లేనివాడి చేత కూడా బలవంతంగా చదివిస్తారు. ఇలాంటి ధోరణితో చదివినా ఒకటే, చదవకపోయినా ఒకటే.

చదువుని చదువు కోసం కాకుండా ఉద్యోగాల కోసం ఎందుకు చదవాలో నాకు తెలియదు. ఉద్యోగం వచ్చిన వెంటనే మనిషి పుస్తకాలన్నీ కట్టగట్టి ఎందుకు అటకెక్కించాలో కూడా నాకు తెలియదు. చిన్నపిల్లల ముందు శృంగారం (sex) గుఱించి మాట్లాడ్డం అపరాధమైతే, వాళ్ళని అందుకు ఉపయోగించుకోవడం నేరమైతే వాళ్ళతో ఉద్యోగాల గుఱించి, డబ్బు గుఱించి మాట్లాడ్డం కూడా అంతే తప్పు. వాళ్ళ అభిరుచులు సహజంగా పెంపొందకుండా చంపెయ్యడం అది. వాళ్ళని ఎదగనివ్వకపోవడం అది. వాళ్ళ చిన్నారి మనసుల్ని ధనసంపాదనా విలువలతో, ఆర్థిక వర్గభేదాలతో కలుషితం చెయ్యడమే అది వాళ్ళ సావధానాన్ని మళ్ళించడమే అది. వాళ్ళు దేనికి పనికొస్తారో దాన్ని నిర్భయంగా సాధన చెయ్యనివ్వాలి. వాళ్ళకి దేనిమీద ఆసక్తి ఉందో దానిలో నిపుణులుగా ఎదిగేందుకై వాళ్ళకు చేయూత నివ్వాలి. వాళ్ళకి ఇష్టం లేని విద్యలూ, నైపుణ్యాలూ, శాస్త్రాలూ మనకి వ్యక్తిగతంగా ఎంత ఇష్టమైనా, వాటికి బయటి ప్రపంచంలో ఎంత గిరాకీ ఉన్నా వాటిని వాళ్ళ నెత్తిమీద రుద్దబోమని భరోసా ఇచ్చే విద్యావ్యవస్థ కావాలి. అందుకు పూచీ పడతామని ప్రమాణం చేసే తల్లిదండ్రులు కావాలి. ఏ నైపుణ్యమూ, ఏ జ్ఞానమూ స్వతహాగా తనయందు ఒక వ్యాపార విలువని గానీ, లౌకిక ప్రయోజనాన్ని గానీ కలిగి ఉండదు. ఆ జ్ఞానం పదిమందికి చేఱిన రోజున, అది ఇవ్వగల సంతోషాన్ని, సౌకర్యాన్ని, దాని గొప్పతనాన్ని పదిమంది గుర్తించిన రోజున, వాళ్ళకి దాని ప్రాముఖ్యాన్ని బోధపఱిచిన రోజున అది లాభసాటి అవుతుంది. నిర్లక్ష్యానికి గుఱయ్యే నైపుణ్యాల, శాస్త్రాల విషయమైనా అంతే ! ఆ పని చెయ్యకుండా ఏకంగా వాటిని ఎత్తేస్తే ?

కూటి కోసమే చదివే కూలీలతో నిండిపోయిన దేశం జ్ఞానసమాజం (knowledge society) గా అవతరించడం శశవిషాణ ప్రరోహం, ఆ చదువులు ఇంగ్లీషులో ఉన్నా సరే !

# నిరుద్యోగం పురుషలక్షణం

## నాలుగో అధ్యాయం

## వాళ్ళక్కావాల్సింది కాదు, మనక్కావాల్సింది చూసుకోవాలి

Big money వాలాలు మనల్ని ఎటు తోలితే అటు పరిగెత్తుతున్నాం, వివేకం లేకుండా ! వాళ్ళలో ఒకడికి ఒక తెల్లవారు జామున జీవసాంకేతికత (biotechnology) తో వ్యాపారం చెయ్యాలని బుద్ధి పుడుతుంది. అతను పొద్దునే లేచి జీవసాంకేతికతకున్న ఉజ్జ్వల భవిష్యత్తు గుఱించి ఒక తెలుగు దినపత్రిక లోను, ఇంకో ఇంగ్లీషు దినపత్రికలోను సచిత్రవ్యాసాలు రాయిస్తాడు. ఆ తరువాత విద్యాశాఖామంత్రితోను, కులపతుల (Vice Chancellors) తోను మాట్లాడి మూణ్ణాలుగు విశ్వవిద్యాలయాల్లో జీవసాంకేతిక కోర్సులు పెట్టిస్తాడు. మనం గంతులేస్తూ పోయి వాటిల్లో చేఱతాం. బాగా నడిచినంతకాలం "అయ్యో ! బయోటెక్నాలజీ చదవకపోతే ఎలా బతుకుతావురా బాబూ ?" అని మధ్యతరగతి తల్లిదండ్రులు పిల్లల్ని అహర్నిశలూ వేధిస్తారు. అయిదాఱేళ్ళు పోయాక అతనిలాంటివారు చాలామంది అదే వ్యాపారంలోకి దిగుతారు. అందుచేత అందఱూ నష్టాల బారిన పడతారు. మొదట ఈ కోర్సు దేశానికి అత్యవసరమని, అది లేకపోతే వెనకబడతామనీ ఉద్ఘోషించిన ఘరానా కిరాయి విద్యావేత్తలు హఠాత్తుగా తామే వెనకబడి అదృశ్యమవుతారు. ఆ కోర్సు చదివినవాళ్ళు మటుకు వీధిన పడతారు. ఆ కోర్సు ద్వారా ఉద్యోగాలు సంపాదించుకున్నవాళ్ళ ఉపాధులు ఉన్నట్లుండి ఊడిపోతాయి. అలాంటివారు జీవసాంకేతికతకి పరిమితం కాకుండా వైవిధ్యభరితంగా వేఱే రంగాల్లో తమ నైపుణ్యాల్ని సానబట్టుకోవాలని పనికిమాలిన ఉచిత సలహాలు పడేయడం మొదలుపెడతారు అదే పత్రికలవాళ్ళు. "అవును, నిజమే సుమా వాళ్ళు చెప్పేది ! మనమీ కోర్సు చదవడం తప్పు కాదు. మన నైపుణ్యాల్ని వివిధీకరించుకోకపోవడమే తప్పు." అని మనం తప్పంతా అమాయకంగా మనయందు ఆరోపించుకొని లెంపలేసుకుంటాం. Big money వాలాలు మన శ్రేయోభిలాషులని మనం గొఱ్ఱెల్లా నమ్మినంతకాలం ఇదొక అంతులేని కథ. వాళ్ళు ఎవరికీ శ్రేయోభిలాషులు కారు. వాళ్ళు తమకు తాము శ్రేయోభిలాషులు, అంతే ! "లాభసాటి" అనుకుంటే ఒక వ్యాపారాన్ని తెఱవడం, "నష్టదాయకం" అనుకుంటే దాన్ని అమాంతం మూసిపారెయ్యడం వాళ్ళకి పెద్ద పని కాదు. అలాగే ఒక ఉద్యోగాన్ని అలవోకగా సృష్టించడమూ, తరువాత దాన్ని ఆకస్మికంగా ఊడగొట్టడం కూడా వాళ్ళకి మంచినీళ్ళ ప్రాయం.

ఈ వివేకభ్రష్ట సంపాతాలకి అసలు కారణం - మనకేం కావాలనే స్పృహ మనకి లేకపోవడం. మనకేది ఇష్టమో మనకి తెలియకపోవడం. మనం ఏ పని చేస్తే మనకి మనం ఉపయోగపడతామో మనకి అర్థం కాకపోవడం. Big money వాలాల్లో ఒకడంటే ఒకడికి పడదు. అంకెలు అంతమైన చోట వాళ్ళ ఆశ అంతమవుతుంది. కనుక ధన సంపాదనలో పరస్పరం మించిపోవాలని వాళ్ళు అహోరాత్రాలూ ఆవురావురుమంటూంటారు. వాళ్ళు తమ స్థాయిలో తాము ఏ విధంగానైతే కుత్తుకలు ఉత్తరించుకుంటూ పోటీ పడతారో అదే విధంగా మనల్ని కూడా మన స్థాయిలో తమ యొక్క అచ్చమైన ప్రతిబింబాలుగా తీర్చిదిద్ది పరస్పరం పోటీపడేలా చేశారు. కానీ ఇందులో మతలబు - వాళ్ళ పోటీ కోటి కోసమైతే మన పోటీ కూటి కోసం.

మనక్కావాల్సిన, మనకిష్టమైన రంగంలో చదువు చదివే అవకాశం మనకుండాలి. ఆ చదువుకు గల ఉపాధి అవకాశాల్ని ఎవరూ ఏ మార్గంలోను హరించకుండా రక్షణ కావాలి. అందుకోసం ప్రభుత్వాన్ని, ప్రైవేటు సంస్థల్ని నిలదీయడానికి మనం సంఘటితులం కావాలి. మన దేశంలో ఈ స్పృహ లేనేలేదు. ఈ దేశంలో నిరుద్యోగానికున్న కారణాల్లో ఒకటి - ఇక్కడ కులాలవారీగా, మతాలవారీగా, ప్రాంతాలవారీగా సంఘటితం కావడం ఒక్కటే నేర్పారు జనానికి. నిజానికి ఉపాధికి సంబంధించి మనం సంఘటితం కావాల్సింది విద్యార్హతల వారీగా ! అంటే మనక్కావాల్సింది బి.కామ్ పట్టభద్రుల సంఘం, ఎమ్.కామ్ పట్టభద్రుల సంఘం (M.Com Graduates Association) మొదలైనవి. గత శతాబ్దకాలంగా సంఘటితమై ఉన్న న్యాయవాదుల్ని, వైద్యుల్ని చూసైనా మిగతా పట్టభద్రులు ఏమీ నేర్చుకోకపోవడం శోచనీయం. ఫలితంగా వారి ఉపాధిని అయోగ్య

లైన ఇతరులు బహిరంగంగా హరిస్తూంటే నోరు మూసుకొని మౌనప్రేక్షకత్వం వహించడం వారి వంతవుతోంది. ఉదాహరణకి - మీరు దేశంలో ఉన్న ఏ ఎల్.ఐ.సి. కార్యాలయానికైనా వెళ్ళి చూడండి. అక్కడ సగం కంటే ఎక్కువ మంది బి.ఎస్.సి. ప్రాథమిక విద్యార్హతగా గల ఉద్యోగులు కనిపిస్తారు. నిజానికి ఎల్.ఐ.సి. చేసే వ్యాపారం యొక్క స్వభావరీత్యా అక్కడ బి.కామ్, ఎమ్.కామ్ చదివినవాళ్ళు ఉండాలి. కాని ఎందుకు అలా జఱగడంలేదు ? మఱి అత్యధికుల ఆమోదాన్ని పడసిన ఈ కాలపు జీవనసూత్రం ప్రకారం చదువులు చదువుతున్నది ఉద్యోగాల కోసమే అయినప్పుడు ఆ చదువులకే ఉద్యోగాల్లో ఇలా అన్యాయం చెయ్యడం ఏంటి ? ఉద్యోగాల్లోనే కాదు, అయోగ్యులైన, అనుభవహీనులైన వ్యక్తులు కేవలం తమ దగ్గఱ పెట్టుబడి ఉందనే కారణం చేత పరిశ్రమల్ని మొదలుపెట్టడాన్ని కూడా వ్యతిరేకించాల్సి ఉంది.

భారీ పరిశ్రమల్లోను, చేపట్టులలోను అందరికీ ఉపాధి కల్పించడం సాధ్యపడదు కాబట్టి వాస్తవానికి మనం దృష్టి కేంద్రీకరించాల్సింది స్వయం-ఉపాధి మీద. చదువుకీ, ఉపాధికీ ఇంత అక్రమంగా ముడిపెట్టే ఈ కాలంలో - మీరు ఏ విశ్వవిద్యాలయంలో నైనా విద్యార్థులకి పనికొచ్చే స్వయం ఉపాధి కోర్సులూ, కుటీర / చిన్న తరహా పరిశ్రమల/ సేవల కోర్సులూ చూశారా ? నేనయితే బహు కొద్దిచోట్ల, అదీ బహు తక్కువ కోర్సులు చూశాను. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో చిన్నపిల్లల సంరక్షణ బాధ్యత గురించి ఒక కోర్సు ఉంది. అలాగే భార్యాభర్తలకి కౌన్సెలింగ్ కోసం ఇంకో కోర్సు ఉంది. అంతే ! ఇంకేమీ లేవు. మిగతావాటిల్లో నైతే ఇవి కూడా లేవు. ఇవి కూడా పొఱపాట్న ఎందుకు ఉనికిలో ఉన్నాయంటే Big money వాలాలు ప్రస్తుతం చేస్తున్న వ్యాపారాలకి ఇవి అడ్డం కాదు కనుక. ఒకవేళ వాళ్ళు కూడా పిల్లల సంరక్షణా, కౌన్సెలింగు వ్యాపారాన్ని భారీయెత్తున ప్రారంభిస్తే విశ్వవిద్యాలయాలు సదరు కోర్సుల స్వయం-ఉపాధి స్వభావాన్ని సమూలంగా తుడిచిపెట్టి ఆ కంపెనీల కనుగుణంగా పరిశ్రమోన్ముఖం (industry-oriented) గా ఆ కోర్సుల్ని రూపాంతరిస్తాయి. ఆ దృష్ట్యా ఈ విశ్వవిద్యాలయాల స్వయంప్రతిపత్తి, వీటిని నడిపే ఆచార్యుల సొంతతనమూ (originality) పునరాలోచించదగినవి.

**మనిషిక్కావాల్సినవి రెండు విషయాలు.** ఒకటి వనర్లు. అంటే సారవంతమైన భూమి, పరిశుభ్రమైన నీరు, వాటిల్లోని మూలకాలు. ఇవి అతనికీ, అతని కుటుంబానికీ, బంధుమిత్రవర్గానికీ అధీనంలో ఉండాలి. రెండోది నైపుణ్యాలు. ఇవి మూడు రకాలుగా ఉంటాయి. మనుగడ నైపుణ్యాలు (survival skills), జీవన నైపుణ్యాలు, సహాయక నైపుణ్యాలు అని ! మనుగడ నైపుణ్యాలంటే - మిమ్మల్ని ఎవరైనా బలవంతంగా ఓడెక్కించి తీసుకెళ్ళి దేశానికి సుదూరంగా ఒక నిర్జనదీవిలో కట్టుబట్టలతో వదిలేశారనుకోండి. అక్కడ మీరెలా కొత్త జీవితాన్ని ప్రారంభిస్తారు ? ముందు మీకు ఆహారం కావాలి. బట్టలు కావాలి. ఇళ్ళు కావాలి. ఆ తరువాత రోగాల నుంచి, స్థానిక జంతువుల నుంచి రక్షణ కావాలి. ముందు మీరు అక్కడ దొఱికిన దానితో కడుపు నింపుకుంటారు. తరువాత సముద్రతీరానికెళ్ళి చేపలు పడతారు. ఆ తరువాత అక్కడ ఏ ధాన్యజాతులూ, ఫలపుష్పజాతులూ పెఱుగుతాయో పరిశీలించడానికి తిరుగుతారు. ఏదైనా దొఱికితే దాన్ని మీతోటివారందఱి కోసమూ పండించడానికి రంగంలోకి దిగుతారు. అక్కడేవైనా గుహలుంటే ముందు వాటిల్లో మకాం పెడతారు. అవి లేకపోతే అక్కడి చెట్ల ఆకులు కోసి, మట్టిగోడలతో గుడిసెలు వేసుకుంటారు. దొఱికిన జంతువుల్ని చంపి వాటి తోళ్ళు వలిచి బట్టలుగా చుట్టుకుంటారు. స్వేచ్ఛగా, నెమ్మదిగా ఉపకరణాల్ని సానబట్టుకుంటూ, శోధిస్తూ మీరూ, మీ పిల్లలూ కలిసి కేవలం కొన్ని దశాబ్దాల్లో అక్కడొక నాగరికతని నిర్మిస్తారు.

అక్కడ మీకు ఉద్యోగాలేవీ ఉండవు. కానీ ఈ అవసరాల మూలంగా చేసుకోవడానికి చేతుల నిండా పని మాత్రం దొఱుకుతుంది. వాస్తవానికి మనక్కావాల్సింది అదే. మన కోసం, మన ఇష్టపూర్వకంగా, మనకి పనికొచ్చే పనిని మన వనర్లతో, మన సొంత నైపుణ్యాలతో, మనమందరం కలసికట్టుగా చేసుకోవడం. ఆ విధంగా మన వనర్లతో జీవితాన్ని, ఆయుర్దాయాన్ని, కాలాన్ని యథేచ్ఛగా అనుభవించడం. నైపుణ్యాలు గల జీవితానికి సెలవు లేదు. పనివేళల్లేవు. రిటైర్ మెంట్ అంతకంటే లేదు. కానీ ఈ విధమైన మనుగడ నైపుణ్యాలు ఈ క్షణంలో మనకున్నాయా ? మనం చదివే చదువూ, మనం అలవఱచుకునే సంస్కృతీ, మనం ఎప్పుడూ చెయ్యని వ్యాపారాలకి పనికొచ్చేదే తప్ప మానవజాతికి అత్యవసరమైన ప్రాథమికమైన మనుగడ-నైపుణ్యాల్ని ప్రసాదించేది

కాదు. ఎందుకంటే వాటిక్కావాల్సిన వనర్లు కొద్దిమంది హక్కుభుక్తం చేసేసుకున్నారు. ఒక్క అంగుళమైనా ఖాళీభూమి ఎక్కడా లేదు. ఒక చుక్క నీరు కూడా ఉచితంగా ఎక్కడా దొఱకడం లేదు. మనం పుట్టకముందే ఇవన్నీ ఎవరో ఎల్లాయి పేరిటా, పుల్లాయి పేరిటా పంపకాలై పోయాయి. అందుచేత ప్రభుత్వంవారు మనకి ఉద్యోగాలు తప్ప వేఱే మోక్షమార్గమేదీ చూపడానికి సిద్ధంగా లేరు. అందువల్ల వాళ్లు మనకి సహాయక నైపుణ్యాలు (అనగా professional specializations) తప్ప ఇంక ఏ నైపుణ్యాలూ నేర్పించడానికి ఇష్టపడ్డం లేదు. మనది కూడా పని తగ్గించుకుని తీఱిక సమయం మిగల్చుకుని జీవితాన్ని ఆస్వాదించాలనే ధోరణి కనుక ఈ విధమైన జీవితంలో మనకి తప్పేమీ కనిపించడం లేదు. కానీ చిత్రమేంటంటే మనం ఎంతగా శ్రమ తగ్గించుకుందామని చూస్తే అంతగా మన సమయం ఉద్యోగాలు సంపాదించుకోవడంలోను, వాటిని చెయ్యడంలో హరించుకుపోవడం. తీఱిక లేదంటూ మళ్ళీ మొదటికొస్తున్నాం. ఆ క్రమంలో మనుగడ-నైపుణ్యాల్ని మాత్రం శాశ్వతంగా పోగొట్టుకుంటున్నాం.

బట్ట ఎలా నేసుకోవాలో, స్వతంత్రంగా తిండి ఎలా పండించుకోవాలో, అగ్గిపెట్టెలు లేకుండా నిప్పెలా రాజెయ్యాలో, గుడిసె ఎలా వేసుకోవాలో, పెంకుటిల్లు ఎలా కట్టుకోవాలో, ఎడ్లబండి/ గుఱ్ఱబ్బండి ఎలా తయారు చేసుకోవాలో, ఆత్మరక్షణ ఎలా చేసుకోవాలో ఏ విశ్వవిద్యాలయమూ నేర్పదు. అయితే వీటన్నింటికీ అత్యంత ఖరీదైన ప్రత్యామ్నాయాల్ని మన సమకాలీన వ్యాపార నాగరికత మనకి చూపిస్తుంది. ఒకవేళ అవి పర్యావరణానికి ప్రమాదకరమైతే వాటి తాతల్లాంటి మఱింత ఖరీదైన మఱికొన్ని ప్రత్యామ్నాయాల్ని పరిష్కారం పేరుతో మనముందు ఉంచుతుంది. అంతే తప్ప ఈ వ్యాపార నాగరికతా స్ఫూర్తి (commercial sentiment) కి విరుద్ధంగా ఇక్కడేమీ జఱగదు.

Big money వాలాలు చేసేది ఏంటయ్యా అంటే ముందు పేద, మధ్యతరగతివాళ్ళ వనర్లని స్వాధీనం చేసుకుంటారు. తరువాత వాళ్ళలో కొంతమందికి తమ దగ్గఱ ఉద్యోగాలిస్తారు. ఆ తరువాత వాళ్ళ నైపుణ్యాల్నీ, పరిజ్ఞానాల్నీ కూడా స్వాధీనం చేసుకుంటారు. ఉదాహరణకి - ఇంట్లో పెట్టుకునే ఊఱగాయని ఒక Big money వాలా తన కర్మాగారంలో తయారు చెయ్యడం మొదలుపెట్టాక అతని అమ్మకాలు విజృంభించే కొలదీ ఆ ఊఱగాయకి సంబంధించిన తరతరాల పరిజ్ఞానమంతా పేద, మధ్యతరగతుల నుంచి ధనిక వర్గాలకి బదిలీ అవుతుంది. కాలక్రమంలో ఆ నైపుణ్యానికి వాళ్ళు ఎంతగా దూరం చెయ్యబడతారంటే - ఒకప్పుడు మొత్తం ఊఱగాయ ప్రక్రియంతా క్షుణ్ణంగా తెలిసినవాళ్ళు కాస్తా, ఇప్పుడా కర్మాగారంలో నూనె కలపడానికో, ముక్కలు కొయ్యడానికో, జాడీలు కడగడానికో, ప్రయోగాత్మకంగా రుచి చూడ్డానికో పరిమితమైపోతారు. అలా వాళ్ళు ఉత్పత్తి ప్రక్రియ మీదా, ఉత్పత్తిసాధనాల మీదా తమ హక్కునీ, అదుపునీ సంపూర్ణంగా కోల్పోతారు. ఈ కాలంలో సాధారణంగా మగవాళ్ళు ఏది చేస్తే అదల్లా ఆడవాళ్ళకి ఆదర్శమై కూర్చుంటుంది గనుక నేర్పులూ, నైపుణ్యాలూ లేకుండా బతకడాన్ని ఆధునికతగా భ్రమించే మధ్యతరగతి ఆడవాళ్ళు పుట్టుకొస్తారు."మేము ఇంట్లో ఏమీ చేసుకోం, నాకసలు వంటే రాదు. మా ఆయనకి నేనంటే ఎంతో ప్రేమ. నన్ను వంటే చెయ్యనివ్వడు. మాదంతా packaged food, tin food. ఫలానా కంపెనీ ఊఱగాయ తప్ప కొనం, ఫలానా బ్రాండు మినరల్ వాటర్ తప్ప తాగం, తెలుసా ?" అని సగర్వంగా ప్రగల్భాలు పలకడం మొదలుపెడతారు. ఇలా మనం అటు వనర్లూ, ఇటు జీవననైపుణ్యాలూ అన్నీ కోల్పోయి “పసిడి గలుగువాని బానిస కొడుకులు”గా మారి వాళ్ళ దగ్గఱ ఉద్యోగాలు చెయ్యడానికీ, వాళ్ళ మట్టి దులపడానికీ తద్ద్వారా డబ్బు తెచ్చుకోవడానికి తప్ప జీవితంలో ఇంకెందుకూ పనికిరాకుండా పోతాం. ఆ ఉద్యోగాలు ఏ కారణం చేతనైనా అనూహ్యంగా ఊడిపోతే ఆ రోజున ఆ చేతకానితనం మన ప్రాణాలు తీసేయవచ్చు కూడా.

ఇక్కడ ఇంకో గొలుసుకట్టు కూడా ఉంది. నైపుణ్యాల స్వాధీనం ద్వారా వనర్ల స్వాధీనమూ, మళ్ళీ దీనికి విపర్యాసక్రమంలో వనర్ల స్వాధీనం ద్వారా నైపుణ్యాల స్వాధీనమూ మార్చిమార్చి జఱుగుతూంటాయి. ఏ వరసలోనైనా దరిద్రించబడేది మాత్రం సామాన్య జనమే. "ఇంత డబ్బు (నకిలీ సంపద) ఇవ్వజూపుతున్నాం కదా, నీకెందుకోయ్ వనర్లు ?" అని వారు వాదిస్తారు. "నీకెందుకోయ్ వనర్లు ?" అనే మాటలో "నీకెందుకోయ్ నైపుణ్యాలు ? నీకెందుకోయ్ భావితరాలు ? నీకెందుకోయ్ స్వేచ్ఛ ? నీకెందుకోయ్ ప్రజాస్వామ్యం ? నీకెందుకోయ్ మానవహక్కులు ?" అని అనేక అంతరార్థాలు ఇమిడి ఉన్నాయి. వాళ్ళక్కావాల్సిన నైపుణ్యాలే మనలో ఉండాలి. మనకంటూ మనం అభివృద్ధి చేసుకునే నైపుణ్యాలేమీ ఉండకూడదు. వాళ్ళ అవసరాల కనుగుణంగా మనల్ని మనం వేశ్యల్లా

తీర్చిదిద్దుకోవాలి. అంతే ! డబ్బు అనబడే నకిలీ సంపద కంటే వనర్లూ, నైపుణ్యాలూ చాలా గొప్పవనీ, అవే మన తరువాతి తరాలకి మనం సంక్రమింపజేయగల అతిగొప్ప ఐశ్వర్యాలనీ ఈ మధ్యతరగతి వెట్టిమాలోకాలు ఎప్పుడు తెలుసుకుంటారో !

**మానవీయ నాగరికత స్థానంలో వ్యాపార నాగరికత :-** అది ప్రజాస్వామ్యమైనా, కేపిటలిజమైనా, సోషలిజమైనా, ఏ వ్యవస్థకీ ప్రజలు తమ మానాన తాము బతకడం బొత్తిగా నచ్చదు. ప్రతి విషయంలోను నాయకులనబడే వ్యాపారుల వేలుండి తీరాలి, వాళ్ళు కెలకాలి, వాళ్ళు పిసకాలి, వాళ్ళు కంపు చెయ్యాలి. మీరు మంచినీళ్ళడిగితే వాళ్ళు ఇవ్వరు. "కోకాకోలా కొనుక్కోవచ్చుగా ?" అని ఎదురుప్రశ్న వేస్తారు. లేకపోతే "ఆ మంచినీళ్ళు కూడా కోకాకోలావాళ్ళే తయారు చేస్తున్నారు, కొనుక్కోండి" అంటారు. ప్రతి విషయమూ ఒక cash crop గా మార్చబడింది కనుక ఈ నాగరికతలో వ్యాపారి భగవంతుడిలా సర్వాంతర్యామి. అందుచేత ఒకపక్క వ్యాపారిగాను, ఇంకోపక్క నాయకుడుగాను అతను ఎల్లలు లేని మనిషి. అన్నిట్లోను వేలు పెడతాడు. అలా అన్నివిధాలా వ్యాపారుల్ని బాగుచెయ్యడం, వాళ్ళని పీకలమొయ్య మేపడం తప్ప ఈ నాగరికతకి, ఈ వ్యవస్థకి వేటే అర్ధమూ, పరమార్థమూ ఉన్నట్లు కనిపించడం లేదు. వాళ్ళే అసలైన "We, the people of India...." లా ఉన్నారు.. మనమేమో వాళ్ళ పెళ్ళికి బాజాభజంత్రీలం మాత్రమే. It's here for businessmen, of businessmen, by businessmen. అంతే ! వాళ్ళు ఎలాంటి జడ్డి వాతావరణాన్ని సృష్టించారంటే - చేతనయితే మనం కూడా వ్యాపారులం అవ్వాలే తప్ప ఈ వ్యవస్థలో వాళ్ళని ఎదిరించి బతకలేం. వాళ్ళు పాత వస్తువులకి ప్రత్యామ్నాయరూపంగా చూపించే ఉత్పత్తుల ముడిపదార్థాలూ, వాటి వనర్లూ, వాటిని తయారు చేసే నైపుణ్యాలూ కొద్దిమందికి సొంతం. చేతనయితే మనం వాళ్ళ దగ్గఱ పనిచేసి జీతం తెచ్చుకుని, ఆ డబ్బుపోసి వాటిని కొనుక్కోవాలి. లేకపోతే నోరు మూసుకోవాలి. దీన్నే మనం ప్రజాస్వామ్యంగా, స్వేచ్ఛగా, ఆధునికతగా, అభ్యుదయంగా భావించి తరించాలి. అంతే ! అంతకు మించి ఆశించకూడదు. ఇది మనం ఉన్న పరిస్థితి.

**మానవీయత వ్యక్తిగత స్వతంత్రతతోనే సాధ్యం :** మనం ఈనాడు వృత్తులనీ, ఉద్యోగాలనీ అనుకుంటున్నవి ఒకప్పటి సమాజంలో పరస్పర సహాయాలు మాత్రమే. ఒక వైద్యమైనా, విద్యాబోధనైనా, న్యాయవాదిత్వమైనా, పౌరోహిత్యమైనా, భటత్వం (policing) అయినా, ఆఖరికి వ్యవసాయ కూలీపనైనా ఇవన్నీ చిన్నపల్లెల్లో నివసించిన స్నేహితులు తమ ఇఱుగుపొఱుగువాళ్ళకి సహాయంగా మొదలుపెట్టినవి మాత్రమే. వీటిల్లోకి డబ్బు అనబడే "విలువల రవాణాసాధనం" ప్రవేశించాక ఇవి తమ సహజమైన సహాయస్వభావాన్ని సంపూర్ణంగా కోల్పోయాయి. అంతకుముందు లేని సమాచారమూ, సాధనాలూ అనంతరకాలంలో వీటిల్లో తామరతంపరగా పోగుపడ్డాయి, కానీ ఆనాటి మానవీయధోరణి మటుకు దయనీయంగా కఱవైంది.

అందుచేత మనక్కావాల్సింది ప్రాథమిక వనర్లే (resources) గానీ ముష్టి ఉద్యోగాలు కాదు. ఖర్మకాలి తప్పనిసరై ఉద్యోగం చెయ్యాల్సి వచ్చినా మన దృష్టిని కేంద్రీకరించాల్సింది, చరిత్రగతిలోమనం పోగొట్టుకున్న వనర్లని, నైపుణ్యాల్ని తిరిగి చేజిక్కించుకోవడం మీద. ఆ ఉద్యోగాల్ని మనం అందుకోసం తాత్కాలికంగా వాడుకోవాలి. వాటిల్లో జీవితాంతం చతికిలబడ్డానికి కాదు. కంపెనీ ఆఫీసు గోడలపై బల్లులుగా, సాలెపురుగులుగా, గబ్బిలాలుగా మారి అక్కడి ఈగల్నీ, దోమల్నీ భక్షించడానిక్కాదు. మనక్కావాల్సినవి నైపుణ్యాలు. మనుగడ నైపుణ్యాలూ, జీవననైపుణ్యాలూ, పరస్పర సహాయక నైపుణ్యాలు, ఆత్మరక్షణ నైపుణ్యాలు. మనల్ని అంతిమంగా నిలబెట్టేవీ అవే. శాశ్వతంగా నిలిచేవీ అవే, కార్లూ కావు, కంప్యూటర్లూ కావు, రాకెట్లూ కావు. దేశంలో పదో తరగతికి మించిన చదువు ఎవరికీ లేకపోయినా, నా దృష్టిలో అది పెద్దగా బాధపడాల్సిన విషయం కాదు. చదివింది ఎంత కొంచెమైనా చదివినంతవఱకు పరిపూర్ణత (perfection) సాధిస్తే చాలు. అది జీవితాంతం గుర్తుంటే చాలు. మనక్కావాల్సింది మనం మనంగా బతకడం, మన బతుకు మనం బతకడం. అంతేగానీ కంపెనీల్ని బాగుచెయ్యడం, వాళ్ళకి కంచిగరుడసేవలు చెయ్యడం మన కర్తవ్యం కాదు, లేక ప్రభుత్వాలకి దాసోహమై "సర్కార్ ! బాంచెన్ కాల్మొక్త" అంటూ జోలె పట్టుకుని నిలబడ్డమూ కాదు, అది చిరంజీవి కానీ, నాయుడు కానీ, వైయెస్ కానీ, ఎవరైతే మనకేంటి ? మనక్కావాల్సింది మన జీవితాల మీదా, మన జీవనవిధానం మీదా మన చెప్పుచేతలూ, మన అదుపాజ్ఞలు. అంతే

తప్ప రాజకీయపక్షాలూ, ప్రభుత్వాలూ ఇవ్వజూపుతున్న ఉచితాలు కాదు. వనర్ల ఆధారంగా తోటి మనుషులతో వ్యాపారం చెయ్యడమూ కాదు, లాభాలు గడించడం అంతకంటే కాదు. మోతుబరులమై, కామందులమై బలిసిపోవడమూ కాదు.

బతకడానికి డబ్బు కంటేను, ఉద్యోగాల కంటేను, వ్యాపారాల కంటేను స్థానికంగా చేసుకునే పరస్పర సహాయాలు ముఖ్యమైనవి. అవే నిజంగా ఆధారపడదగ్గ ఋణ రేకులు (credit cards). మన సామాజిక వలయమే మన నిజమైన డబ్బు. మనం అవతలివారి చొక్కా పట్టుకొని నిలదీసేదాన్ని బట్టి, మనం ఆశించడాన్ని బట్టి చాలా మార్పులు చోటు చేసుకుంటాయి. ఆశించడానికే ఇష్టపడనివాళ్ళూ, ఏం ఆశించాలో తెలియనివాళ్ళూ, ఆశించడమే తప్పని భావించేవాళ్ళూ ఉన్న చోట ఏ మార్పులూ రావు. మనుషుల నుంచి మనం ఆశించాల్సింది విద్యార్హతల్ని కాదు, మానవత్వాన్ని, సహజత్వాన్ని ! మనక్కావాల్సింది - ఉద్యోగాల కోసం జీవితంలో యాభై చోట్లకి వలసపోవడమో, లేక రోజు వందా - రెండొందల క్రోసులు ప్రయాణం చెయ్యడమో, లేక రోజు వెయ్యిమందిని చూసి సాంస్కృతిక ఘాతాల (culture shocks) కి గుఱై మతి పోగొట్టుకోవడమో కాదు. మనక్కావాల్సినవి మన మొహం తెలిసిన, మనవనుకున్న స్థిరమైన జనావాస కమ్యూనిటీలు.

ఈ కఠోర సత్యాల్ని జనం ఎప్పటికి గ్రహిస్తారో తెలియదు.

# నిరుద్యోగం పురుషలక్షణం

## అయిదో అధ్యాయం

## గతం నుంచి పాఠాలు నేర్వాలి

వలసపోవడం కొన్నిసార్లు జాతికి మేలు చేస్తుందనేది నిజం. ఇంగ్లీషు, స్పానిషు, పోర్చుగీసు, అరబ్బీ జనాలు భారీగా వలసపోవడం వల్లనే ప్రపంచస్థాయి జాతులుగా మారారు. వాళ్ళ ఒకప్పటి ప్రాంతీయభాషలు కాస్తా ఈనాటి అంతర్జాతీయ భాషలయ్యాయి. (అయితే వాళ్ళు చేసింది కేవలం వలసపోవడం కాదను కోండి) వలసపోనివారు ఎంత పెద్దజాతైనా స్థానికులుగా, ప్రాంతీయజనంగా సంకుచితంగా చూడబడుతున్నారు. కొంతమంది వలసపోయినప్పటికీ మాతృదేశం తాలూకు విషయాలపై కృషి చేస్తూంటారు. అందువల్ల ఇతరదేశాల గుఱించి అక్కడ ప్రచారంలో ఉన్న అపోహలు ఎంతోకొంత తగ్గడానికి అవకాశం ఉంటుంది. మనదేశం విషయంలో మనకి ఎగుమతి వ్యాపారాలు తక్కువ కనుక విదేశీమారకద్రవ్యం కోసం వలసపోయిన ప్రవాసుల డాలర్ జమల (remittances) పై ఇతోఽధికంగా ఆధారపడే పరిస్థితి ఉంది.

వలసలన్నీ అవసరాన్ని పురస్కరించుకునే జరుగుతున్నాయా ? ఉపాధి కోసం వలస పోవడం తప్పు కాదు. కానీ అదే పనిగా తెగిన గాలిపటాల్లా తరం తరం, నిరంతరం వలస పోతూండేవాళ్ళు వట్టి వ్యర్థజీవులు. వాళ్ళ యజమానుల సంగతేమో గానీ, వాళ్ళ వల్ల వాళ్ళకే కాక ఇతరులక్కూడా ఏ ప్రయోజనమూ లేదు. సమాజానికసలే లేదు. ఎందుకంటే వాళ్ళకొక సమాజమంటూ ఏమీ లేదు. ఇక్కడ "తరం తరం" అనడం అంత్యప్రాస కోసం కాదు. ఎందుకంటే ఈ వలసపోవడంలో ఒక తరతరాల సరళి (pattern) ఉంది. సాధారణంగా వలసదారుల వంశచరిత్రల్ని తిరగేస్తే వాళ్ళ కథలన్నీ మూసపోసినట్లు

ఇలా ఉంటాయి. ముందు వాళ్ళ తాత తన స్వగ్రామాన్ని వదిలిపెట్టి జిల్లాకేంద్రానికి వలసొచ్చి ఉంటాడు. వాళ్ళ నాన్న జిల్లాకేంద్రాన్ని వదిలిపెట్టి రాష్ట్ర రాజధానికి వలసొచ్చి ఉంటాడు. ప్రస్తుతతరం వారు రాజధానిని వదిలిపెట్టి అమెరికాలో వాలడానికి టెక్కలు కట్టుకుని ఉంటారు. ఈ ధారావాహిక తరువాయి భాగంలో - వారు అమెరికాలో స్థిర పడ్డాక వారబ్బాయి కెనడా వెళ్ళిపోతాడు. వారి కోడలు హవాయీ వెళ్ళిపోతుంది. ఏం సాధించారు ? అంటే ఆ ఒక్కటీ అడక్కూడదు. కానీ ఈ విధమైన శాఖాచంక్రమణం చుట్టూ జనం అల్లుకునే చిలవలూ, పలవలూ (hype) దానికి ఆపాదించే ప్రతిష్ఠ మిక్కిలి జాజ్వల్యమానమైనవి. కానీ Big money వాలాలకి ఈ తరహా మనుషులే కావాలి. స్వదేశీయత, జాతీయమైన ఆహార వేషభాషలూ గట్రా రంగురంగుల ఈకలన్నీ బలవంతాన పీకేసుకుని బోడిగా తయారై, ఆటా, పాటా మర్చిపోయిన ఈ అసహజమైన నెమళ్ళని వారు కంపెనీలనే జంతుశాల (Zoo) ల్లో పెంచుతూంటారు.

కానీ జాతి గర్వించదగ్గ విషయాలూ, జాతికొక ఉనికినిచ్చే విషయాలూ భౌగోళికమైన స్థిరజీవనం వల్లనే సిద్ధిస్తాయి. ఒకచోట స్థిరంగా తరతరాల పాటు గడిపే స్థానికుల వల్లనే ఆయా ప్రాంతాలు అభివృద్ధి చెందుతాయి. అలా గడిపేవారిలోనే భూమి పట్ల మమకారమూ, తన్మూలకమైన దేశాభిమానమూ, మతాభిమానమూ, భాషాభిమానమూ పదిలంగా ఉంటాయి. ఏదైనా సంక్షోభం వచ్చినప్పుడు అటువంటివారు మాత్రమే దేశప్రయోజనాల్నీ, ప్రాంతప్రయోజనాల్నీ కాపాడ్డానికి నడుం బిగిస్తారు. వారికి మాత్రమే ప్రజల్లో రాజకీయ పలుకుబడి ఉంటుంది తప్ప వలసపోయే పలాయనవాదులకి కాదు.

**నగరాల అభివృద్ధికి పరిమితి వద్దా ?** వలసపోవడమూ, వలసవాదమూ ఒకటి కావు. వలసపోయినవాళ్ళంతా వలసవాదులు కారు. వారు వలసదార్లు మాత్రమే. కానీ వలసలోనే జీవనప్రగతి ఉందని నమ్మేవాళ్ళు వలసవాదులు. పైన చెప్పిన విధంగా, అదొక విచిత్ర జీవన వేదాంతం. ఇక్కడ మనం ముఖ్యంగా గమనించాల్సింది,"ఈ వలసవాదానికి ఆయువుపట్టు మహానగరాలు" అని. ఎందుకంటే, వలసలన్నీ మహానగరాల నుంచి, లేదా మహానగరాలకి జఱుగుతూంటాయి. ఈ వలసల మూలంగా మన జీవితకాలంలో మహానగరాలు రాష్ట్రాలంత, దేశాలంత జనాభాలతో విస్తరించాయి. కారణం - నాలుగైదు జిల్లాలకి సరిపడ జనాభా వాటిల్లోనే పోగుపడుతోంది. బతుకుతెఱువు నిమిత్తం సామాన్యప్రజలూ, గుర్తింపు నిమిత్తం మేధావులూ, కళాకారులూ, ఆస్తుల్ని పెంచుకునే నిమిత్తం రాజకీయనాయకులూ - ఇలా రకరకాలవాళ్ళు వచ్చేసి నగరాల్లో తిష్ఠ వేస్తున్నారు. తమకి అనుకూలించే అనేక కారణాల చేత నగరాల్లో ఉండడం Big money వాలాలకి అభిమతం. వాళ్ళు మన యజమానులు కనుక వాళ్ళ కనుసన్నల్లో మెలగడం కోసం మనమూ నగరాల బాట పట్టుతాం. అలా ఉద్యోగాలు ఇచ్చేవాళ్ళు వందల్లోను, అవి తీసుకునేవాళ్ళు లక్షల్లోను వలసరావడం చేత ఈ నగరాలు ఇలా అనారోగ్యకరంగా ఉబ్బిపోయాయి, వాచిపోయాయి.

ఈ సందర్భంగా మానవజాతిచరిత్ర మనకి నేర్పుతున్న గుణపాఠాన్ని అందఱూ సుఖంగా మర్చిపోతున్నారు. ఏ దేశచరిత్ర తీసుకున్నా మహానగర నాగరికతలన్నీ నామరూపాల్లేకుండా నశించాయి. పల్లె నాగరికతలు మాత్రం కాలప్రవాహానికి ఎదురొడ్డి నిలబడ్డాయి. నిలబడ్డమే కాక ఈ రోజుకీ కొనసాగుతున్నాయి కూడా. దీనికి రెండు కారణాలున్నాయి. మహానగరాలు ఉత్పత్తికేంద్రాలైనప్పటికీ వనర్ల పరంగా స్వతంత్రమైనవి కావు. అవి పల్లెపట్ల సరఫరాల మీద ఇనుమిక్కిలి ఆధారపడతాయి. రెండోది - వాటిని శత్రువులు నాశనం చెయ్యడం చాలా సులభం. ఒకేసారిగా ఒకే చోట లక్షలాది మందిని ఊచమట్టుగా నిర్మూలించవచ్చు. అక్బర్ సైన్యాలు చిత్తోడ్ మీద దాడి చేసినప్పుడు ఆ నగరంలోని నలభై ఎనిమిది వేలమంది పౌరుల్ని ఒక్క పూటలో సంహరించారు. నాదిర్ షా ఢిల్లీ మీద దండయాత్ర చేసినప్పుడు ఒకే రోజులో అయిదు లక్షలమంది ఢిల్లీపౌరుల్ని చంపగలిగాడు. తళ్ళికోట యుద్ధంలో కృష్ణదేవరాయల అల్లుడు రామరాయలు చనిపోయాక అయిదు లక్షలమంది విజయనగర పౌరుల్ని బహ్మనీ సుల్తానుల సైన్యాలు మూడు రోజుల్లో నఱికిపారేశాయి. ఈ రోజుల్లో ఇలా నిర్మూలించడం ఇంకా సులభం, క్షణాల్లో పని. గతంలో ఇలాంటివి ఎన్ని జఱిగినా భారతీయ నాగరికత నశించలేదు. కారణం - ఆరోజుల్లో మన ఆయువుపట్టు నగరాల్లో కాక ఆఱులక్షల గ్రామాల్లో ఉంది. కానీ ఇప్పుడు జఱుగుతున్న భారీ నగరీకరణ పర్యవసానం ? ఆ నగరీకరణ కంటే,

నగరాల మీద గ్రామాలు ఆధారపడేలా చెయ్యడానికి అంతిమ ఫలితార్థం ?

నగరజీవితం అంతర్జాలం (Internet) లాంటిది. అనామకత్వానికి అవకాశం హెచ్చు. ఎక్కడైనా, ఏ వెధవ పనైనా చేసి ఎవరూ కనుక్కోకముందే మొహం చూపించకుండా మాయం కావచ్చు. అందుచేత అక్కడి జనం పౌరబాధ్యత (civic sense), వాహన రద్దీలో క్రమశిక్షణ మొదలైనవి అలవాటు చేసుకోవాల్సిన అవసరాన్ని అనుభూతి చెందరు. నగరవాసుల్లో డెబ్బైశాతం మందికి అవి స్వస్థలాలు కావు, వాళ్ళలో కొంత మంది అక్కడే పుట్టినా కూడా ! అందుచేత ఒక చిన్నపట్టణాన్ని, గ్రామాన్ని ప్రేమించినట్లు జనం వాటిని ప్రేమించరు. ఉపయోగించుకుంటారంతే !

**స్వతంత్రత కూడా ఒక సమున్నత జీవనవిధానం-ఒక జీవన వేదాంతం :** ప్రభుత్వంతో పాటు పెక్కు ప్రైవేటు వ్యాపారాలూ, ఉత్పత్తి ప్రక్రియలూ (production processes), అలాగే పరిపాలనా కార్యకలాపాలూ (administrative duties) తగినంతమంది ఉద్యోగులు లేకుండా నడవవు. అంతమాత్రాన కేవలం ఉద్యోగాల్ని సమాజంలో ప్రతివారి జీవితానికీ అన్వయించే జీవనవేదాంతంగా మార్చడం అంగీకారయోగ్యం కాదు. ఈనాడు ఈ వైఖరి వేలంవెర్రిగా మారడం వల్లనే మనం ప్రత్యామ్నాయాల గుఱించి మాట్లాడుకుంటున్నాం. జీవితంలో పెక్కు విషయాలకి పరిచాయక ప్రాధాన్యం (introductory value) మాత్రమే ఉంటుంది. వాటిని ఆధారంగా చేసుకొని అసలైన ప్రాధాన్యాలు తరువాత ప్రవేశిస్తాయి. ఒక తరగతిలో ఒక పాఠ్యపుస్తకాన్ని నిర్దేశించారంటే దానర్థం - ఆ సబ్జెక్టుకి సంబంధించి విద్యార్థి బతుక్కంతా కలిపి ఆ పుస్తకం ఒక్కటే సరిపోతుందని కాదు. అలాంటి పుస్తకాలు ఇంకా పదో ఇఱవయ్యో అదనంగా చదవాలని అర్థం. తప్పు చేసినందుకు తండ్రి దండిస్తున్నాడంటే దానర్థం నాన్నలంతా దుర్మార్గులని కాదు, ఱేపు ఆ కొడుక్కి కొడుకు పుడితే వాణ్ణి క్రమశిక్షణలో పెట్టే పాత్రని ఎలా పోషించాలో ఆయన ఆచరణాత్మకంగా చేసి కొడుక్కి చూపిస్తున్నాడన్నమాట. అలాగే మనం ఈరోజు ఉద్యోగం చేస్తున్నామంటే దానర్థం - మనం ఆ ఉద్యోగానికి అంటుకుపోవాలని కాదు. ఉద్యోగాల్లేకుండా మనం స్వతంత్రంగా బతగ్గలం. అలా అని నమ్మినరోజున తప్పకుండా బతగ్గలం. ఉద్యోగాల కోసం తాపత్రయపడ్డం వెనుక జీవితభద్రత కోరుకునే ధోరణి కనిపిస్తుంది. అన్ని రకాల అనిశ్చితుల (uncertainties) నుంచి, రిస్కుల నుంచి విముక్తి పొంది, ఱేపటి గుఱించి ఆందోళనపడకుండా, నిర్ణీత వేళల (fixed timings) లోనే పని చేస్తూ ఖచ్చితమైన, క్రమబద్ధమైన (regular) ఆదాయాన్ని అందుకోవాలనే ఆరాటం గోచరిస్తుంది. ఉన్నదాన్ని కాపాడుకుంటూనే లేనిదాన్ని అందుకోవాలనే జాగ్రత్త కానవస్తుంది. సమకాలీనంగా చాలామందికి ఇది సాధ్యపడుతోంది కనుక మనకూ సాధ్యమేననే ఆత్మవిశ్వాసం కూడా చాలామందిలో ఉంది. ఈ ఆత్మవిశ్వాసంతోనే వారు కష్టపడి చదువుతారు. చదివినది జీవితానికి తప్పకుండా పనికొస్తుందని దృఢంగా నమ్ముతారు. పరీక్షలు రాస్తారు. ముఖాముఖీలకి హాజరవుతారు. అందుకోసం ఎంత దూరమైనా వెళతారు. చదువుకోవడం కోసం రాత్రిపూట కూడా పనిచేస్తారు. లంచమూ, పలుకుబడి అవసరమంటే తల తాకట్టు పెట్టైనా సరే, అవి తెచ్చి పెద్దల్ని సంతృప్తి పఱుస్తారు. ఈ యావత్తు కార్యకలాపానికి వారిని చూస్తే ముచ్చటేస్తుంది. కానీ ఇందులో మాత్రం ఏ అనిశ్చితులూ లేవా ? ఎక్కడో ఒకచోట బోర్లాపడే అవకాశం లేదా? ఇందులో కూడా సాహసోపేత ధోరణి, రిస్కు లేవా ? ఎంత భవిష్యద్ భద్రత ఇస్తే మనకు సరిపోతుంది ? కోటి ? రెండు కోట్లు ? అయిదు కోట్లు ? నా దృష్టిలో ఇది హాస్యాస్పదమైనది. ప్రతిజీవీ పుడుతూనే తన ఆహారాన్ని వెతుక్కుంటోంది. ఆ క్రమంలో ఎన్నో రిస్కులు ఎదుర్కుంటోంది. ఏ రిస్కూ లేకుండా బతకాలనుకుంటూ ఉద్యోగాలూ, వాటిల్లో రిజర్వేషన్ లూ, మళ్ళీ వాటిల్లో వర్గీకరణలూ అంటూ జల్సాగా బతికెయ్యాలనుకునేది మనిషొక్కడే.

మన కాలపు చదువు జీవితానికి రిస్క్ ఉండడం తప్పని బోధించే చదువు. అది పురుషలక్షణం గల చదువు కాదు. ప్రతిదానికీ ప్రణాళిక అవసరమని అది చెబుతుంది. నాటకంలో నటుడిలా మనిషి ప్రతిదానికీ ముందే రిహార్సల్స్ చేసి సన్నద్ధంగా ఉండాలని అది బోధిస్తుంది. కానీ ప్రణాళిక వెయ్యడం కుదఱని పరిస్థితుల్ని ఎలా ఎదుర్కోవాలో దాని దగ్గర సమాధానం లేదు. అలాంటి పరిస్థితుల్లో మనల్ని ఆదుకునేది మనిషికి ప్రకృతి సహజంగా ప్రసాదించిన నాటుదనమూ, మోటుదనమూ. కానీ ఈ చదువు

వాటిని నశింపజేస్తోంది. మనిషి ఎంతగా చదివితే అంతగా చొఱవ, సాహసమూ లేని శుంఠ, వెన్నెముక లేని చవట అవుతున్నాడు. చదువుకున్నవాణ్ణి ఎవరైనా చెంపదెబ్బ కొడితే, అతను దిగ్భ్రాంతి చెంది బుగ్గలు నిమురుకుంటూ "వీడు నన్నెందుకిలా కొట్టాడు ? నేనిప్పుడు తిరిగి కొడితే ఏం జఱగొచ్చు ? కొట్టకపోతే ఏం జఱగొచ్చు ?" అని ఆలోచిస్తూండగా ఇంతలో ఇంకో దెబ్బ పడుతుంది. సహజమైన నాటుదనం గల వ్యక్తి ఇలా అఱనిమిషంలో అఱవై ఆలోచనలు చెయ్యడు. "ఏమైతే అదయిందిలే" అని ఒకదెబ్బకి నాలుగు దెబ్బలు వడ్డీతో సహా అంటించి అప్పుడు ఆలోచిస్తాడు. అదే అసలు మనిషి చెయ్యాల్సిన పని. కానీ ఇంత అతి-ఆలోచనాపరులకి స్వతంత్రజీవనం పేరు చెబితే చాలా భయం వేయడం సహజం. మనిషి తన ఆత్మవిశ్వాసాన్నీ, ఓర్పునీ, కష్టాన్నీ, తన ఇఱవయ్యేళ్ళ (విద్యా) శ్రమని ఇతరుల కోసం కాకుండా తనకోసం వెచ్చిస్తే ఉద్యోగం చేసే వారికంటే ఎక్కువ బాగుపడతాడనీ, ఇంకా తొందఱగా బాగుపడతాడనీ నా నమ్మకం. ఈ నమ్మకం నిరాధారం కాదు.

ఎందుకంటే మనిషి ఆర్థికంగా బాగుపడ్డానికి కావాల్సింది ఐన్‌స్టీనంత తెలివితేటలు కాదు. బాగుపడ్డవాళ్ళెవరూ వాస్తవానికి మఱీ తెలివిగలవాళ్ళూ కారు. భారీ బడ్జెట్ తో మొదలైనవాళ్ళూ కారు. అది ఆఱు ప్రాథమికమైన భౌతిక విషయాల మీద ఆధారపడి ఉంటుంది.

**౧. ఒకటిరెండు చిన్నరంగాల్లో కనీస నైపుణ్యం (Minimal skill) :** ఒక నైపుణ్యం వారికి ఉద్యోగం తెచ్చిపెడితే, ఇంకో నైపుణ్యం వారిని స్వతంత్రుల్ని చేస్తుంది. అంటే ఒకపక్క ఉద్యోగం చేస్తూండగానే ఇంకోపక్క రెండో నైపుణ్యాన్ని సమాజం మీద ప్రయోగించి చూసుకుంటూ ఉంటారు. రెండో నైపుణ్యం వల్ల భారీగా లాభించడం మొదలుపెట్టాక ఉద్యోగానికి శాశ్వతంగా స్వస్తి చెప్తారు.

**౨. కొనసాగ (Consistency) :-** జనం వచ్చినా రాకపోయినా, పైసా సంపాదించినా, సంపాదించకపోయినా బాధపడకుండా రోజూ ఒకవేళకి వచ్చి కార్యాలయంలో కూర్చుంటారు. "ఈ వ్యక్తి తప్పకుండా అందుబాటులో ఉంటా"డనే నమ్మకాన్ని జనంలో కలిగిస్తారు. లాభాలు వచ్చినా, రాకపోయినా, కేవలం కుటుంబపోషణ తప్ప ఇంకేమీ మిగలకపోయినా భయపడరు. ఏళ్ళ తరబడి మొండిగా ఆ కార్యకలాపంలోనే కొనసాగుతారు.

**౩. ఆ రంగానికి సంబంధించినవాళ్ళతో స్నేహసంబంధాలు :-** ప్రతిరంగంలోను చిన్నచేపలూ, పెద్దచేపలని రెండురకాలుంటారు. స్వతంత్రులు "చిన్నచేపలమైనా ఫర్వాలే"దనుకుంటారు. కొన్నిసార్లు పెద్దచేపలకి తీఱిక లేక కొన్ని పనులు వీరికి అప్పగిస్తారు. ఆ రంగంలో అందఱితోను భుజాలు పూసుకుని తిరుగుతూండడం వల్ల అందులోని తాజా పరిణామాలూ, పోకడలూ ఎప్పటికప్పుడు అర్థమవుతాయి.

**౪. స్థానికంగా ముద్రాంక విలువ (Local Brand Value) :-** కేవలం కంపెనీలకే కాదు, వ్యక్తులకీ, కుటుంబాలకీ, కులాలకీ, మతాలకీ, ప్రాంతాలకీ, దేశాలకీ కూడా ముద్రాంక విలువ ఉంటుది, "వీళ్ళు ఈ పనైతే బాగా చెయ్యగలరు. వీళ్ళు ఇలాంటివాళ్ళు" అని సమాజంలో ఉన్న అభిప్రాయమే ఆ ముద్రాంక విలువ. దాన్ని బట్టి వాళ్ళ అవకాశాలూ, ఆదాయ మార్గాలూ, బాగుపడ్డాలూ, చెడిపోవడాలూ ఆధారపడి ఉంటాయి. అందుచేత స్వతంత్రులు ఈ ముద్రాంక విలువని జాగ్రత్తగా, నెమ్మదిగా, నింపాదిగా నిర్మించుకుంటారు. లేదా తమ దృష్టిలో తమకొక ముద్రాంక విలువ ఇప్పటికే ఉన్నట్లయితే దానికి ఆదరణ లభించగల ప్రదేశాన్ని సక్రమంగా గుర్తుపట్టి అక్కడికి వెళతారు.

**౫. వివేకవంతంగా వనరుల్ని నిర్వహించడం :-** ఇక్కడ 'పొదుపు' అనే మాట వాడదల్చుకోలేదు, కొంతమందికి పిసినిగొట్టుతనం గుర్తొస్తుంది కనుక ! స్వతంత్రంగా బతికేవారికి ఆదాయం రోజువారీ వ్యవహారం, ఉద్యోగుల్లా నెలవారీ కాదు. ఏ ఉపాధి అయినా, సేవ అయినా చుఱుగ్గా జరిగేది - ఏడాదికి ఆర్నెల్ల నుంచి ఎనిమిది నెలల కాలం మాత్రమే. కనుక వ్యర్థమైన ఆడంబరాల్లోను, భోగాల్లోను, వేడుకల్లోను జీవితాన్ని వృథా చెయ్యరు.

**౬. కుటుంబసభ్యుల ప్రోత్సాహం :-**స్వతంత్రులకి కుటుంబ మద్దతు చాలా ఎక్కువ. వారితో పాటు వారి కార్యకలాపాల్లో కుటుంబసభ్యులు కూడా ఒక చెయ్యివేసి సహాయం

చేస్తారు. ఎవరైనా "నాకు ఉద్యోగం వద్దు, స్వతంత్రంగా బతుకుతా" నంటే చాలామంది మధ్యతరగతి విద్యావంతులు విద్యుద్ ఘాతం తగిలినట్లు ఉలిక్కిపడి పడిపోతారు. ఆ ధోరణి లేని కుటుంబసభ్యులు స్వతంత్రులకి చాలా అవసరం. రోజూ ఇంటికొస్తూనే, " అది మానెయ్యి. పక్కింటబ్బాయి ఫలానా కంపెనీలో చేరాడు. నీకంటే బాగా సంపాదిస్తున్నాడు." అని చెవిలో జోరీగలా చేరి నసపెట్టేవాళ్ళు ఇంట్లో ఉండరు.

**కేవల వర్తమానోన్ముఖమైన దృక్కోణం మనల్ని చారిత్రికంగా నిర్మూలిస్తుంది :** కేవలం పొట్టకూటి చదువులే చదివి, పొట్టకూటి నైపుణ్యాలు మాత్రమే అభ్యసించి, పొట్టకూటి పనులు మాత్రమే చేసే మానవసమూహాలు - ఆ పనులు సమకాలీనంగా గౌరవప్రదాలైనా కాకపోయినా - తమ తదనంతరం చారిత్రికమైన Blackout కి గురవుతారు. అంటే వారి వివరాలు చరిత్రలోకి ఎక్కవు. వారి తరఫున సాక్ష్యం చెప్పడానిక్కూడా చరిత్రలో ఎవరూ మిగలరు. కనుక పొట్టకూటితో సంబంధం లేని నైపుణ్యాలకీ, ఆలోచనలకీ సైతం సమాజంలో సాదరప్రోత్సాహం లభించాలి - అది నిజంగా మానవ సమాజమే అయితే ! సమాజంలో కాయకష్టం చేసేవారూ, తక్షణావసరాల కోసం కృషి చేసేవారూ ఉండడం ఎంత అవసరమో, అది చెయ్యనివారు ఉండడం కూడా అంతే అవసరం. వారిని సోమరిపోతులుగా, ఇతరుల మీద ఆధారపడేవారుగా, పనికిరానివారుగా, అసమర్థులుగా చూడ్డం కేవలం అమాయకత్వం, దూరదృష్టిరాహిత్యం. ఎలాగైతే ఒక చెట్టు తన భవిష్యత్తుని విత్తనాల్లో దాచుకుంటుందో, ఎలాగైతే అది తన శక్తిని దుంపల్లోను, కాయల్లోను భద్రపఱచుకుంటుందో అలాగే ఒక మానవ సమాజం కూడా తన భవిష్యద్ బీజాల్నీ, తన చరిత్రనీ, తన నాగరికతా ఫలాల్నీ మఱీ ఎక్కువగా కష్టపడనటువంటి, పెద్దగా పని చెయ్యనటువంటి, డబ్బుసంపాదన అంతగా చేతకానటువంటి మేధావుల దగ్గఱ దాచుకుంటుంది. ఆ తెలివితేటలు వ్యక్తిగతంగా ఆ మేధావులకి చెందినట్లు పైకి కనిపిస్తాయి, ఆ సమాజం ఈరోజు లేకపోవడం చేత ! కానీ అవి వాస్తవంగా ఆ కాలపు సమాజానికి చెందినవే. ఆ మేధావులు చేసినది, ఆ ఆలోచనల్ని సమగ్రంగా క్రోడీకరించి, తమ ఆలోచనలతో జతపఱిచి మనకి మింగుడుపడే శైలిలో అందించడం వఱకే. ఎందుకంటే సమాజం కూడా మనిషిలాంటిదే. దానిక్కూడా ఒక తల, కాళ్ళూ, కళ్ళూ, చెవులూ, చేతులూ, పొట్ట, గుండె గట్రా అవయవాలున్నాయి. వాటికి సంబంధించిన పనులు చెయ్యడానికి సిద్ధపడే మనుషులే ఆయా అవయవాలు. వారి వల్ల ఉపయోగం కాలక్రమంలో మాత్రమే తెలియగలదు.

**ప్రభుత్వం పేరుతో మన పిలకల్ని రాజకీయనాయకుల చేతుల్లో పెట్టకండి బాబూ !**
మనం ఉన్న పరిస్థితుల్లో - రాజకీయాలతో సంబంధం లేని సాంఘిక విషయాల్లో నాయకుల్ని దూరంగా ఉంచాలి. వారు ఇనప పాదాలు, ఆలోచనల దొంగలు (idea-thieves). ఎన్నికల నినాదాల వేటగాళ్ళు. ఈరోజు ఒక మేధావి తన పుస్తకంలో రాసినది ఒక పదీ - పాతికేళ్ళ తరువాత ఏదో ఒక రాజకీయ పక్షపు కార్యావళి (agenda) లో ఒక వికృతరూపాన్ని (distorted form) ధరించి చోటు చేసుకుంటుంది. వారు అడుగుపెట్టిన చోటల్లా నిర్ధూమధామం, వారు చెయ్యేసినదల్లా సర్వనాశనం. అందుకు విరుద్ధంగా - వారు ఎక్కడైతే అడుగుపెట్టలేదో, పెట్టలేకపోయారో ఆ రంగాల్లో నిత్యకల్యాణం, పచ్చతోరణం. ఉదాహరణకి - మృదుసామాన్ల (software) రంగాన్నే చెప్పుకోవచ్చు. అది వారికర్థం కాదు గనుక, వారికి అంత బుఱ్ఱ లేదు గనుక వారి జోక్యం లేకపోవడం చేత అది ఈ దేశంలో అభివృద్ధి చెందగలిగింది.

మనం కోరుకునే ప్రతి సామాజిక మార్పుకూ ప్రభుత్వాన్ని ఒప్పించాలనీ, దానికనుగుణంగా చట్టపరమైన మార్పులు తేవాలనీ, తద్ద్వారా దాన్ని అందఱి నెత్తినా బలవంతంగా రుద్దాలనీ, దాన్ని విపరీతంగా ప్రచారం చేసి హోరెత్తించాలనీ, అలా ప్రజల్ని బౌద్ధికంగా జయించాలనీ, మన ఆలోచనాధోరణుల చుట్టూ నిరంకుశ వ్యవస్థల్ని సృష్టించాలనీ భావించడం నా దృష్టిలో విలియమ్ బెంటింక్ కాలం నాటి ముతక ఆలోచనాధోరణి. ఇలాంటిది ఇక్కడ ప్రతిపాదించిన మార్పులకు అవసరం లేదు. వీటికి అంగీకరించేవారు సైతం ఆ విధమైన ఆలోచనాధోరణికి దూరంగా ఉంటే బావుంటుంది. అందఱూ ఇంగ్లీషు మాధ్యమంలో చదవాలని ఈ రాష్ట్రంలో ఎవరు చట్టం చేశారు ? అందరూ టీవీల ముందు కూర్చోవాలని ఎవరు ఉద్యమాలు నడిపారు ? వోటుకు నోటు పుచ్చుకోవాలని ఎవరు ఆందోళనకి దిగారు ? ఎవరి అవసరం కొద్దీ వారు ఆయా పనులు చేస్తున్నారంతే !

ఇక్కడ ప్రతిపాదించినవైనా అంతే ! వీటి సందర్భశుద్ధి (relvance) ని అనుభూతిల్లినవారు వీటిని ఆచరణలో నిజం చేసుకోవడానికి పూనుకుంటారు. తక్కినవారు అలాగే Big money వాలాలు వేసిన పట్టాలకంటిపెట్టుకొని పరుగెత్తుతూంటారు. అది వారిష్టం.

ఉద్యోగాల్లో పురుషలక్షణమేమీ లేదు. అవి మానెయ్యడంలోనే ఉంది అసలైన మగతనం. ఉద్యోగాలు చెయ్యడం మన కాళ్ళ మీద మనం నిలబడ్డం ఎప్పటికీ అవదు.

(సమాప్తం)

